అనురాగముయొక్క ఉద్రేకము పోయినది (కాఁగా), ప్రణయ బహుమానే విగళితే (సతి) = ప్రేమచేతి యాదరము తొలఁగినది (కాఁగా), సద్భావే నివృత్తే (సతి) = విశ్వాసము పోయినది (కాఁగా), (ఇపుడు), జనే జన ఇవ పురః గచ్ఛతి (సతి) = అతఁడు సామాన్యజనుని వలె ఎదుట పోవు చుండఁగా, తత్ (చ) గతాన్ తాన్ దివసాన్ చ = (ప్రియుఁడు చేసిన) యాయవమానమును కడచిపోయిన యా (ప్రేమ) దినములను, ఉత్ప్రేక్ష్య ఉత్ప్రేక్ష్య=తలపోసి తలపోసి, మమ హృదయమ్ = నాగుండె, శతధా న దళతి (ఇతి) యత్ (తత్ర) కో హేతుః న జానే= వేయిగా వ్రయ్యక యున్నందులకు ఏమి కారణమో ఎఱుంగను.

చెలీ, అతఁడు నామీఁది యాప్రేమావేశమును, ఆయాదరమును, ఆ విశ్వాసమును అన్నిటిని విడనాడి ఇప్పుడు ఎవఁడో పరాయివానివలె నా మ్రోల పోవుచుండఁగా చూచి, ఆపూర్వదినములను స్మరించి స్మరించి నా గుండె ఏల వేయి వ్రయ్యలుగా వ్రయ్యదో చెప్పలేకున్నాను.

అవ॥ ప్రియేణ పరిభూతా నాయికా స్వీయాం దశాం సఖ్యాః పురస్తాద్ దాహ - గత ఇతి॥ హే ప్రియసఖి-ప్రేమావేశే రాగోద్రేక - గతే అపగతే సతి - తతః - ప్రణయబహుమానే - ప్రణయేన ప్రేమ్ణా - కృతః - బహుమానః ఆదరః - యాదృశో బహుమానః క్రియతే తాదృశ ఇత్యర్థః - తస్మి - న్విగళితే నివృత్తే సతి, తదనన్తరం - సద్భావే సౌ జన్యే - నివృత్తే అపయాతే సతి, ఇదానీం జనే - తస్మిన్ జనే - జన ఇవ సామాన్యజన ఇవ - పురః అగ్రతః - గచ్ఛతి వ్రజతి సతి - తత్ప్రియ కృత మవమానం చ - గతాన్ యాతాన్ - తాన్ దివసాంశ్చ యేషు దివసేషు సుఖే నోషితం తా నిత్యర్థః - ఉత్ప్రేక్ష్యోత్ప్రేక్ష్య స్మృత్వా స్మృత్వా మమ హృదయం - శతధా శత ప్రకారేణ - నదళత నభిద్యత - ఇతి యత్ తత్ర-కో హేతుః కిం కారణమితి - న జానే నావగచ్ఛా - మీతి సంబన్ధః. అత్ర గతే ప్రేమావేశ ఇత్యాదివాక్యచతుష్టయేన క్రమేణ

ప్రేమహాని ర్గమ్యతే. నిర్వేదో నామ సంచారీ భావః - అత్ర నాయికా సాధారణీ. హేతురలంకారః. 37

---

చిరవిరహిణో రుత్కణ్ఠార్త్యా శ్లథీకృతగాత్రయో

ర్నవ మివ జగ జ్జాతం భూయశ్చిరా దభినన్దతోః

కథ మపి దినే దీర్ఘే యాతే నిశా మధిరూఢయోః

ప్రసరతి కథా బహ్వీ యూనో ర్యథా చ తథా రతిః. 38

చిరమెడఁ బాసిన పడుచుదంపతుల కలయిక:—చిర విరహిణోః= చిరకాలము ఎడఁబాసినవారును, ఉత్కణ్ఠా ఆర్త్యాశ్లథీకృత గాత్రయోః = మిక్కుటంపుఁగోరికచేతి నెగులుచేత సడలినవిగా చేయఁబడిన మేనులు గల వారును, భూయః అభినన్దతోః = మరల (కూడికచే) సంతసించుచున్న వారును, (అయిన) యూనోః=ప్రాయపుదంపతులకు, జగత్ నవమ్ ఇవ జాతమ్=లోకము క్రొత్తదియుంబోలె అయెను, తతః దీర్ఘే దినే యాతే (సతి)=అనంతరము నిడుదయైన పగలు కడచినది కాఁగా, నిశామ్ అధి రూఢయోః (తయోః)=రాత్రిని ఎక్కిన (యాదంపతులకు) (ఆదంపతులకు పగలు ముగిసి రాత్రి వచ్చినప్పుడు అనుట) యథాచ కథా బహ్వీ ప్రసరతి తథా రతిః (బహ్వీ) (ప్రసరతి)=ఏవిధముగా (ఒండొరులకై వారు పడిన యాచిరవిరహతాపాది వృత్తాంతముల) సల్లాపము దీర్ఘమై ప్రవర్తిల్లుచుండు నో ఆవిధముగా సురతంబును దీర్ఘమయి ప్రవర్తిల్లుచుండును.

'దీర్ఘ' అనుటచే ఎప్పుడెప్పుడు సూర్యుఁడ స్తమించునా అని పగ లంతయు మిక్కిలి శ్రమపడుచుండిరని భావము. 'ప్రసరతీ' త్యాదిచే రాత్రిచాలసేపు తమ వియోగ క్లేశాదికములం జెప్పుకొనుచు దీర్ఘ సురతం బునం దేలిరని భావము.

అవ ॥ కవే ర్వాక్యమ్ - చి రేతి॥ చిరవిహిణోః చిరకాలవియుక్త యోః - ఉత్కణ్ఠార్త్యా - ఉత్కణ్ఠయాఔత్సుక్యేన - కృతా - ఆర్తిః

పీడా - తయా - శ్లథీకృతగాత్రయో రవసాదితశరీరయో - ర్యూయోః పున-రభినన్దతోః సంతుష్యతోః - సమాగమే నేతి శేషః - యూనోః యువతిశ్చ యువా చ యువానౌ ॥ సూ ॥ పుమాణ్ స్త్రియా, ఇత్యేక శేషః - తయో - శ్చిరాద్బహుకాలాత్ - జగ ద్భువనం - నవం నూతన - మివ - జాతం ఉత్పన్నం - తతో - దీఘోర్ణ ఆయతే - దినే అహని - కథమపి కృచ్ఛ్రేణ - యాతే-సతి - అత్ర దినస్య దీఘోర్ణతా ప్రతిపత్తి గురుసన్నిధివశా దన్యోన్యం భాషణాద్యభావే నేత్యవగన్తవ్యం - నిశాం రాత్రి-మధిరూఢయోః తయోః బహ్వీ - బహుళా - కథా సల్లాపః - యథా యేన ప్రకారేణ పసరతి ప్రవర్తతే - తథా తేన ప్రకారేణ - రతిః రతం - చ-ప్రసర తీతి సంబన్ధః. చిరాత్సంగతయోర్విరహిణోః పరస్పర క్లేశకథనం ఇతరేతర మపి సుఖావహ మితి భావః. హర్షో నామ సంచారీభావః. నాయికా స్వీయా మధ్యాచ. నాయకోఽనుకూలః. ప్రవాసాన న్తర సంభోగశృఙ్గారః. జాతిరలంకారః. ౩౯



దీఘోర్ణ తోరణమాలికా విరచితా
దృష్ట్యైవ నేన్దీవరైః,
పుష్పాణాం ప్రకర స్స్మితేన రచితో
నో కున్దజాత్యాదిభిః,
దత్త స్స్వేదముచా పయోధరభరే
ణాఘోర్ణ న కుమ్భామ్భసా,
స్వైరే వావయవైః ప్రియస్య విశత
స్తన్వ్యా కృతం మఙ్గళమ్. ౪౦

కాంతుఁడు ప్రవాసమునుండి రాఁగా కాంతకుం గలిగిన సంతోషము యొక్క చిన్నెలను వర్ణించుట:—

తన్వ్యా = సుందరిచేత, విశతః ప్రియస్య = (ప్రవాసమునుండివచ్చి యిల్లు) సొచ్చుచున్న కాంతునికి, దీర్ఘా తోరణమాలికా దృశా ఏవ విరచితా, ఇన్దీవరైః న=నిడుదయైన తోరణపుదండ (ద్వారముగాఁది పూదండ) చూపుతోనే గ్రువ్వఁబడినది, నల్లగలువలతోఁగాదు, అతనిని దూరము నుండియే ద్వారమునుండి నిడువాలిక కన్నులార మిక్కిలి వీక్షించిన దనుట), పుష్పాణాం ప్రకరః స్మితేన రచితః, కున్దజాత్యాదిభిః నో = ముంగిలిలోనగు తావుల పూవుల చల్లుట చిఱునగవుతోనే చేయఁబడినది, మల్లెలు జాజులు లోనగువానితోఁ గాదు, (మల్లెలకన్నను రమణీయముగా చిఱునవ్వు నవ్వుచుండిన దనుట), అర్ఘః స్వేదముచా పయోధర భరేణ దత్తః, కుమ్భ అమ్భసా న=అర్ఘ్యోదకము చెమటను తొరుఁగుచున్న వలుద చన్నులతో ఇయ్యఁ బడెను, కలశ జలముతోఁగాదు, (సంతోషాతిశయము చేత అర్ఘ్యోదకము తేరందోఁపక చెమరుగ్రక్కుచున్న యుబుకు స్తనములు కలదై చూచుచుండెననుట), (ఈవిధముగా), స్వైః ఏవ అవయవైః మఙ్గళం కృతమ్ = తన యవయవములతోనే (ప్రవేశ, మంగళము జరుపఁబడియెను.

ఇందు ప్రియుఁడు వీథిలో దూరమున వచ్చుచుండఁగా ఎదురు చూచుట, ముంగిటం బ్రవేశించి చూపులుగలయఁగా చిఱునగవు, గృహ మధ్యముం జొచ్చి దరిసినంతట చెమరును, అను క్రమము, వాకిట తోరణము, ముంగిట పువ్వులు, మధ్యరంగమున నర్ఘ్యము, నను క్రమముతో సుసంగతంబుగా నున్నది.

అవ ॥ కవే ర్వాక్యమ్ - దీ ర్ఘేతి॥ దీర్ఘా ఆయతా - తోరణమాలికా తోరణస్రక్ - దృష్ట్యైవ - విరచితా నిర్మితా ఇన్దీవరైః నీలోత్పలైః - న విరచితా - పుష్పాణాం కుసుమానాం - ప్రకరః ప్రక్షేపణం - స్మితేన - రచితః - కృతః - కున్దజాత్యాదిభిః మాఘ్యమాలత్యాదిభిః - కుసుమవిశేషైః నకృతః - ఆచారార్థకం గృహాంగణేషు పుష్పోపహారః

క్రియతే - అర్ఘః ఉపచారవిశేషః - స్వేదముచా స్వేదం ఘర్మం ముఞ్చ
తీతి స్వేతముక్ - తేన పయోధరభరేణ కుచభారేణ - దత్తః - కుమ్భా
మ్భసా కలశోదకేన న దత్తః, ఏవం తన్వ్యా నాయికయా - విశతః
దేశాన్తరా దాగత్య గృహం ప్రవిశతః - ప్రియస్య - స్వైః స్వకీయైః -
అఙ్గైరేవ - మఙ్గళం కల్యాణం - కృత మితి సమ్బన్ధః. అత్ర హర్షా
సంచారీ భావః. నాయికా స్వీయా మధ్యా చ. నాయకోఽనుకూలః.
ప్రవాసానన్తరం సమ్భోగః. చేష్టాకృత మాఙ్గల్యోపక్షేపరూపం శృఙ్గారి
నర్మ. రూపకాలంకారః. ౪౦

---

కాన్తే సాగసి యాపితే ప్రియసఖీవేషం విధా యాగతే,
భ్రాన్త్యాలిఙ్గ్య మయా రహస్య ముదితం తత్సఙ్గమాపేక్షయా ;
ముగ్ధే దుష్కర ఏష ఇ త్యతితరా ముక్త్వా సహాసం బలా
దాలిఙ్గ్య చ్ఛలితాస్మి తేన కితవే నాద్య ప్రదోషాగమే. ౪౧

అపరాధి నాయకుఁడు నాయికచే వెడలనడువంబడి సఖీవేషమున
నాయికం గలయుట:—సాగసి యాపితే కాన్తే ప్రియ సఖీ వేషం విధాయ
అద్య ప్రదోష ఆగమె ఆగతే (సతి)=(ఆగస్=) తప్పిదముతో (స=)
కూడుకొన్నవాఁడయి (కావుననే) వెడలఁగొట్టంబడినవాఁడైన ప్రియుఁడు
నాయొక్క అనుంగుఁ జెలికత్తె వేసము దాల్చి ఈ రాత్రియొక్క పూర్వ
భాగమందు వచ్చినవాఁడుకాఁగా (రాఁగా ననుట), మయా భ్రాన్త్యా ఆ
లిఙ్గ్య తత్ సంగమ ఆపేక్షయా రహస్యమ్ ఉదితమ్=(ప్రయోగకృత్య
యము) నేను (నా సఖియే అను) భ్రమచేత కవుంగిలించి అతని పొందు
నందు కోరికచేత రహస్యమును (తటిమితిని పోయి తోడితెమ్ము అని) చెప్పి
తిని, (అంతట) తేన కితవేన = ఆమోసగాఁడు, (హే) ముగ్ధే ఏష అతి
తరాం దుష్కరః ఇతి ఉక్త్వా=ఓబేలా ఈపని మిక్కిలి అశక్యము అని

చెప్పి, సహాసం బలాత్ ఆలిఙ్గ్య (చ్ఛలితా అస్మి = నవ్వుతో బలాత్కారమున కవుంగిలించి మోసము చేసెను (సంగమించె ననుట.)

అవ॥ ధూర్తేన నాయకేన కృతాం వఞ్చనాం నాయికా సఖీభ్యో నివేదయతి - కాన్త ఇతి॥ సాగసి సాపరాధే - కాన్తే - దూషితే - నిష్కాసితే - ప్రియసఖీవేష మిష్టవయస్యా న్నైపథ్యం - విధాయ కృత్వా-పున - రాగతే ప్రాప్తే సతి - మయా - భ్రాన్త్యా అజ్ఞానేన - ఆలిఙ్గ్య పరిరభ్య - తత్సఙ్గమా పేక్షయా - తస్య సంగమ స్తత్సంగమః - తస్మి - న్నపేక్షయా వాఞ్ఛయా - రహసి భవం రహస్యం - ఉదితం కథితం - తత్ర రహస్యం నామ 'గృహాగతః ప్రియతమ యావద్ధరితః, సోఽవశ్యం త్వ యేదానీమేవ ఆనేతవ్యః, నో చేత్ క్షణ మపి జీవితం ధారయితుం న శక్నో మీ' త్యేవం రూపం వచనం - సా ముగ్ధే మూఢే - ఏషః త త్కార్య - మతితరా మత్యర్థం - దుష్కరో దుర్ఘట - ఇత్యుక్త్వా తత - స్సహాసం హాసేన సహితం యథా భవతి తథా - బలా దాలిఙ్గ్య తేన కితవేన ధూర్తేన - అద్య అస్మిన్ దివసే - ప్రదోషాగమే - ప్రదోషో రజనీముఖం-త- స్యాగమః ప్రాప్తిః - తస్మిం - శ్ఛలితా వంచితాఽస్మీతి సంబన్ధః. స్పష్ట ఏ వాభిప్రాయః. నాయికా స్వీయా మధ్యా చ. నాయకః శఠః. సంభోగశృఙ్గారః. అత్ర నర్మగర్భః. యుక్త రలంకారః.

---

**ఆశఙ్క్య ప్రణతిం పటా న్తపిహితౌ పాదౌ కరో త్యాదరా,**
**ద్వ్యాజే నాగత మావృణోతి హసిత , న స్పష్ట ముద్వీక్షతే,**
**మ య్యాలాపవతి ప్రతీపవచనా సఖ్యా సమం భాషతే,**
**తన్వ్యా స్తిష్ఠతు నిర్భరప్రణయితా మానోఽపి రమ్యోదయః.**

నాయకుఁడు తన నాయిక యొక్క మానప్రకారమును వర్ణించుట:—
ప్రణతిమ్ (పాద) ప్రణామమును ( నేను తనపాదములకు మ్రొక్కుగు నని) ఆశఙ్క్య=ఊహించి (నదై), ఆదరాత్ పాదౌ పట అన్త పిహితౌ

కరోతి=(నానాయిక) గౌరవమువలన (గౌరవమిషచేత, అడుగులను వస్త్రము నంచుచేత కప్పఁబడినవానినిగాఁ జేయును (మదపరాధశాంతికై పాద ప్రణామము చేయ నీయదనుట), ఆగతం హసితం వ్యాజేన ఆవృణోతి = వచ్చిన నవ్వును (ఏదో ఒక మిషచేత కప్పిపుచ్చును నవ్వు ప్రసాదసూచకము గాన దానిని అణఁచుకొనుచున్నది), స్పష్టం న ఉత్ వీక్షతే = చక్కఁగా మొగమెత్తి చూడదు (చాయచాయగా చూచుచునే యున్నదనుట), మయి ఆలాపవతి (సతి) ప్రతీపవచనా (సతీ) సఖ్యాసమం భాషతే = నేను మాటలాడుచుండఁగా ప్రతికూలమయిన మాటలుగలదై (తన) సఖితో మాటలాడును (నేను పలుకుమాటలకు ప్రతికూలవచనములను నాతో చెప్పక సఖితో చెప్పును), తస్యాః నిర్భరప్రణయితా తిష్ఠతు మానః అపి రమ్యః ఉదయః = చెలువయొక్క పట్టరాని యనురక్తి యటుండుఁగాక అలుకసయితము మనోహరమయిన ప్రాదుర్భావముకలది (ఈప్రకారముచే ప్రియయొక్క పరమానురాగ మెట్లో అట్లే అలుకయు నన్ను తనియించిన దని భావము). 'ఉదయః' అనుటచేతను ఇదె యామెయొక్క తొలియలుక యని యెఱుకపడుచున్నది.

తా.—నమస్కరింతునని యూహించి ఆదరమిషమున పాదములు నాకగపడనీయక కప్పుకొనుచున్నది. సహజముగా తనవదనమునకు వచ్చిన నవ్వును ఏదో మిషచే అణఁచుకొన్నది, నామాటలకు ప్రతికూలముగా నాతోఁబలుకక సఖితో పలుకుచున్నది, ప్రియయొక్క ప్రేమావేశ మెట్లో అట్లే ఈ ప్రథమమానము సయితము నా చిత్తమును హరించుచున్నది.

అవ|| నాయకోక్తిః - ఆశఙ్క్యేతి || ప్రణతిం ప్రణామ - మాశఙ్క్య ఉత్ప్రేక్ష్య ఏవ ప్రణామం కరిష్యతీ త్యాశఙ్క్య త్యర్థః- ఆదరాద్బహుమానా - త్పాదౌ చరణౌ - పటాన్తపిహితౌ చేలాఞ్చలాచ్ఛాదితౌ - కరోతి - ఆగత ముద్గతం - హసితం - వ్యాజేన కేనాఽపి (చ్) ఛద్మనా- ఆవృణోతి ఆచ్ఛాదయతి - స్పష్టం వ్యక్తం - నోద్వీక్షతే నావలోకయతి-

మయి ఆలాపవతి సతి - ప్రతీప వచనా ప్రతికూల వాక్సతీ - సఖ్యా వయ స్యయా - సమం భాషతే ఆలపతి - తస్యాః కాన్తాయాః - నిర్భరప్రణ యితా - ప్రణయిన్యా భావః ప్రణయితా - నిర్భరా చ సా ప్రణయితా చ ॥ సూ ॥ 'త్వతలోర్గుణవచనస్య' ఇతి పుంవద్భావః - తిష్ఠతు ఆస్తాం - మాన ఈర్ష్యాకృతకోపోఽపి - రమ్యాదరో మనోహరోదయః - ఇతి సంబన్ధః. స్పష్ట ఏ వాభిప్రాయః. నాయికాస్వీయా ప్రగల్భా చ. నా యక శ్శఠః. మానకృత విప్రలమ్భ శృఙ్గారః. మానకృతం చేష్టా రూపం వర్ణ్యం. జాతి రలంకారః. ౪౨

---

సా యావ న్తి పదా న్యలీకవచనై రాళీజనైః పాఠితా
తావ న్త్యేవ కృతాగసోఽద్రుతతరం వ్యాహృత్య పత్యుః పురః
ప్రారబ్ధా పరతో యథా మనసిజ స్యేహా తథా వర్తితుం ;
ప్రేమ్ణో మౌగ్ధ్యవిభూషణస్య సహజః కోఽప్యేష కాన్తః క్రమః.

సా = ఆనాయిక, అలీక వచనైః ఆళీజనైః యావన్తి పదాని పాఠితా = మాయ మాటలుగలవారయిన చెలికత్తెలచే ఎన్ని మాటలు నేర్పఁబడినదో, తావన్తి ఏవ కృత ఆగసః పత్యుః పురః ద్రుతతరం వ్యా హృత్య = అన్నిటినే (ఆమాటలనుమాత్రమే) చేయఁబడిన నేరమి గలవాఁ డయిన (అపరాధియయిన) భర్తయొక్క యెదుట మిక్కిలి వడిగా పలికి, (తతః) మనసిజస్య ఈహా యథా తథా పరతః వర్తితుం ప్రారబ్ధా = (అనం తరము) మన్మథునికోరిక యెట్లో అట్లు అంతటను వర్తించుటకు ఆరంభించి నది, మౌగ్ధ్య విభూషణస్య ప్రేమ్ణః ఏషః సహజః కః అపి కాన్తః క్రమః= ముగ్ధత్వము ఆభరణముగాఁ గలిగిన యనురక్తికి ఇదిస్వాభావికమును అనిర్వ చనీయమును మనోహరమును (అయిన) ప్రకారము.

తా.— ఒకానొకముద్దరాలు తనకు మగనిపై చెలికత్తెలు నేర్పిన కోపంపు మాటలను ఆతనియెదుల పాఠము అప్పగించినట్లు (శుకానువాదము

వలె) వడివడిగా పలికి అనంతరము మదనేచ్ఛావశంవదయై యతనితో యథాపూర్వముగా వర్తించుచుండెను. ముగ్ధత్వముచే శోభిల్లుచుండెడి ప్రేమకు ఇది స్వాభావికమయిన మనోహర ప్రకారము, దీనిసొంపును వాక్రువ్వఁదరముగాదు.

అ॥ కవేర్వాక్యమ్ - సేతి॥ సా నాయికా - అళీకవచనైః మిథ్యాభాషితైః - అళీజనైః సఖీజనైః - ర్వ్యావర్తిపదాని యావత శ్శబ్దార్థ- పాఠితా అగమితా - కృతాగసః కృతాపరాధస్య - పత్యుః ప్రియస్య - పురః అగ్రతః - తావం త్యేవ పదాని - ద్రుతతర మతిశీఘ్రం - వ్యాహృత్య ఉచ్చార్య - తతః పరం - మనసిజస్య మన్మథస్య - ఈహా కాంక్షా - యథా భవతి తథా పరితః - వర్తితుం చరితుం - ప్రారబ్ధా ఉపక్రాన్తా- మార్గ్ధ్య విభూషణస్య - మార్గ్ధ్య మప్రాగల్భ్యం విభూషణ మాభరణం - యస్య తత్తథోక్తం తస్య - ప్రేమ్ణః ప్రియత్వస్య - ఏషః - సహజః నైసర్గికః - కోఽప్యనిర్వచనీయః - క్రమః ప్రకారః. - అభిప్రాయో వ్యక్త ఏవ. నాయికా స్వీయా ముగ్ధా చ. నాయక శ్శఠః. సంభోగశృఙ్గారః. అత్ర సఙ్కేచ్ఛారూపం శృఙ్గారి నమః. జాతి రలంకారః. ౮౩

---

దూరా దుత్సుక, మాగతే వివళితం, సంభాషిణి స్ఫారితం,
సంశ్లిష్యత్యరుణం, గృహీతవసనే సంకోచితభ్రూలతమ్,
మానిన్యా శ్చరణానతివ్యతికరే బాష్పాంబుపూర్ణం క్షణాత్
చక్షు ర్జాత, మహోప్రపఞ్చచతురం జాతాగసి ప్రేయసి.

మానిన్యాః చక్షుః = అలుకగలదానియొక్క (అలిగిన నాయిక యొక్క) నేత్రము, జాత ఆగసి ప్రేయసి = ఉత్పన్నమయిన తప్పిదముకల వాఁడయిన (తప్పుచేసినవాఁడయిన) ప్రియతమునివిషయమున, (దూరాత్ ఉత్సుకమ్ = దవ్వున (అతఁడు దూరమున వచ్చుచుండఁగా) కోర్కెచే నువ్విళ్లూరుచున్నదియు, ఆగతే (సతి) వివళితమ్ = (అతఁడు) (చెంతకు)

రాఁగా అతనికి త్రిప్పఁబడినదియు, సంభాషిణి (సతి) స్ఫారితమ్ = మాట లాడువాఁడు కాఁగా (మాటలాడం దొడంగుడు) విస్తరిల్లఁ జేయఁబడి నదియు, సంశ్లిష్యతి (సతి) అరుణమ్ = కవుంగిలించుచుండఁగా ఎఱ్ఱ నిదియు, గృహీత వసనే (సతి) సంకోచిత భ్రూ లతమ్ = పట్టుకొనఁ బడిన వలువకలవాఁడు కాఁగా (వలువ నతఁడు పట్టఁగా నే) ముడువఁబడిన బొమ తీఁగలుగలదియు, చరణ ఆనతి వ్యతికరే (సతి) బాష్ప అమ్బు పూర్ణమ్ = పాదముల నమస్కృతియొక్క సంబంధము కలవాఁడు కాఁగా (పాదముల కతఁడు ప్రణమిల్లఁగా) అశ్రు జలముతో నిండినది (యు), క్షణాత్ ప్రపఞ్చ చతురం జాతమ్ = (ఈవిధమున) అల్ప కాలములో నే నానాప్రకారములచేత మనోహరము అయినది. ఇందు వరుసగా తొలుత సహజప్రేమయు అనంతరము క్రమక్రమముగా కోపవృద్ధియు కడపట కోప శాంతియుం జెప్పఁబడినవి.

తా.—ప్రియతముఁడు సాపరాధుఁడు వచ్చుచుండఁగా నాయిక కుపితయయ్యును తొలుత సహజప్రేమతో నతనిని ఉవ్విళులూరుచుం గాంచి నది, అతఁడు సమీపమునకురాఁగా నే (అతనిని చూడనొల్లక) కంటిని అతని నుండి పెడగా మరల్చినది, అతఁడు మాటలాడ నారంభింపఁగా నే కన్నులు విచ్చి చూచినది, అతఁడు కవుంగిలింపఁ గడంగుడు కన్నులు ఎఱ్ఱచేసికొన్నది, అతఁడువస్త్రము పట్టుకొనగా నే బొమలు ముడిచినది, పాదములం డ్రెళ్లఁ గా నే బాష్పములజడి గురిసినది, ఇట్లు స్వల్పకాలములో నే ఆమె నేత్రము ఇన్ని విధములు పొంది మనోహర మైనది.

అవ॥ కవే ర్వాక్యమ్ - దూరా దితి ॥ జాతాగసి కృతాపరాధే - ప్రేయసి ప్రియతమే - దూరాత్ స్థితే సతీతి శేషః - ఉత్సుక ముత్కణ్ఠిత, మాగతే ప్రాప్తే సతి - వివలితం వివర్తితం, సంభాషిణి ఆలపతి సతి - స్ఫారితం, సంశ్లిష్య త్యాలిఙ్గతి సతి - అరుణం రక్తం, గృహీతవసనే ఆకృష్టవస్త్రే సతి - సంకోచితభ్రూలతం - సంకోచితాభుగ్నా - భ్రూలతా

భ్రూవల్లీ - యస్య తత్తథోక్తం, చరణానతివ్యతికరే సతి - ఆనతేః ప్రణామస్య - వ్యతికర స్సంబన్ధః - చరణయో రానతివ్యతికరో యస్య తథోక్తః తస్మిన్ - బాష్పామ్బుపూర్ణమ్ అశ్రుజలభరితం - మానిన్యా మానవత్యాః - చక్షుర్నేత్రం - క్షణాదల్పకాలా - త్ప్రపఞ్చచతురం- ప్రపఞ్చేన ఔత్సుక్యాది బహుప్రకారేణ - చతురం మనోహరం - జాతం సంపన్నమ్ - అహో ఆశ్చర్య - మితి సంబన్ధః. అత్ర ఔత్సుక్యం స్వాభావిక ప్రేమాతిశయేన, వివళితత్వ మపరాధినం ద్రష్టు మసహమానతయా, స్ఫారితత్వం క్రోధోదయేన, అరుణత్వం క్రోధవృద్ధ్యా, భ్రూలతాసంకోచః క్రోధాతిశయేన, బాష్పామ్బుపూర్ణత్వం క్రోధశాన్త్యా చేతి వేదితవ్యమ్. అత్ర నాయికా స్వీయా మధ్యాప్రగల్భయో రన్యతరా. నాయక శ్శఠః. మానకృతో విప్రలమ్భశృఙ్గారః. ఈర్ష్యాక్రోధప్రాయం వచః. జాతిరలంకారః. ౪౪

---

అఙ్గానా మతితానవం కుత ఇదం? కమ్పశ్చ కస్మా? త్కుతో
ముగ్ధే పాణ్డు కపోల మాననం? మితి ప్రాణేశ్వరే పృచ్ఛతి,
తన్వ్యా సర్వమిదం స్వభావత ఇతి వ్యాహృత్య పక్ష్మాన్తర
వ్యాపీ బాష్పభర స్తయా వలితయా నిశ్వస్య ముక్తోఽన్యతః.

ముగ్ధే=ఓచిన్నదానా, అఙ్గానామ్ ఇదమ్ అతి తానవమ్ కుతః= (నీ) యవయవములకు ఈ అధికకార్శ్యము ఏకారణమున (కలిగినది), (కిం) చ కమ్పః కస్మాత్=మఱి (యీ) వణఁకు ఏల (కలిగినది) ఆననమ్ పాణ్డు కపోలమ్ కుతః= మొఁగము పాలిన చెక్కిళ్లుగలది ఏల (అయినది), ఇతి ప్రాణేశ్వరే పృచ్ఛతి (సతి)= ఇట్లని జీవితనాయకుఁడు (ప్రియతముఁడనుట), అడుగఁగా, (ప్రయోగవ్యత్యయము.—) తయా తన్వ్యా ఇదం సర్వం స్వభావతః ఇతి వ్యాహృత్య=ఆ చెలువ ఇది యెల్లను స్వభావముచేత నే అని పలికి, వళితయా పక్ష్మ అన్తర వ్యాపీ బాష్పభరః అన్యతః ముక్తః= పెడ

ముగమయి ఱెప్పలలోపల నిండుచున్న కన్నీళ్ల మొత్తమును అవతలి ప్రక్కను విడిచినది.

తా. —ప్రవాసాగతుఁడు నాయకుఁడు నాయికయొక్క తదీయాంగ కార్శ్యాదికమునకు తనతోడి యెడఁబాపే కారణ మని యెఱింగియు, ఆమెను తత్కారణమడుగఁగా ఆమె నీతోడివియోగమే కారణ మని తన ప్రేమాతిశయమును తానె చెప్పుకో నొల్లకయు తన ప్రేమ తం డెఱుఁగఁడాయెఁగదా యను దైన్యముచేతను 'ఇది యెల్ల నాకు స్వాభావికమే' యని వంకరమాట పలికి అవ్వలి మొగంబయి విస్తారముగా కన్నీళ్లు విడిచినది.

అవ ॥ కవే ర్వ్యాఖ్యమ్ - అఙ్గానా మితి ॥ హేముగ్ధే - అఙ్గానాం అవయవానామ్ - ఇదమ్ అతితానవ మతి కార్శ్యం - కుతః కస్మాద్ధేతోః - అయం - కమ్పో వేపథుశ్చ - కుతః కస్మాత్ - ఇద మాననం ముఖం చ - పాణ్డుకపోలం పాణ్డురగణ్డస్థలం - కుత ఇ త్యేవం ప్రాణేశ్వరే ప్రియతమే - పృచ్ఛతి - సానునయ మనుయుఞ్జానే సతి - తన్వ్యా కాన్తయా - సర్వ మిదం - స్వభావతః నిసర్గాత్ - ఇతి - వ్యాహృత్యోక్త్వా - వలితయా వివృత్తయా - నిశ్వస్య నిశ్వాసం కృత్వా - పక్ష్మాన్తర వ్యాపీ - పక్ష్మణా మక్షిరోమ్ణాం - అన్తరం మధ్యం - వ్యాప్నోతీతి పక్ష్మాన్తరవ్యాపీ - బాష్పభరః అశ్రుపూరః - అన్యత ఇతరత్ర - ముక్తో విసృష్ట - ఇతి సంబన్ధః. అత్ర నాయకే కార్యాన్తరవ్యాసఙ్గేన చిరం సమాగత్య తనుత్వాదికం స్వస్యా నాగమనాదితి జానన్నపి కుత ఇతి పృచ్ఛతి సతి ఆర్జవేన వస్తు మసహమానాయా నాయికాయా సర్వమిదం స్వభావత ఇతి వక్రోక్త్యా నిర్వేద స్సూచితః-బాష్పభరోఽన్యతో ముక్త ఇత్యనేన దైన్యం సూచితమ్. అత్ర నాయికా స్వీయా మధ్యా చ - కించ విరహోత్కణ్ఠితా వా, యథోక్తం భారతీయే.—

'అనేక కార్యవ్యాసఙ్గా ద్యస్యా నాగచ్ఛతి ప్రియః
కామతప్తైవ దుఃఖార్తా విరహోత్కణ్ఠితా మతా;

అస్యా స్తనత్వం కమ్ప శ్చ పాణ్డిమా బాష్పనిర్గమః
నిర్వేదశ్వాసదైన్యాద్యా అనుభావా భవన్త్యమీ.' ఇతి.
దైన్యం నామ సంచారీ భావః. ప్రణయమానకృతో విప్రలమ్భశృఙ్గారః.
మానకృతం వాగ్రూపం శృఙ్గారి వర్మ. జాతి రలంకారః. ౪౫

---

రాత్రౌ వారిభరాలసామ్బుదరవోద్విగ్నేన జాతాశ్రుణా
పాన్థేనాత్మవియోగదుఃఖపిశునం గీతం తథోత్కణ్ఠయా
ఆస్తాం జీవితహారిణః ప్రవసనాలాపస్య సంకీర్తనం
మానస్యాపి జలాఞ్జలి స్సరభసం లోకేన దత్తో యథా. ౪౬

(ప్రయోగవ్యత్యయము.—) రాత్రౌ వారిభర అలస అమ్బుదరవ ఉద్విగ్నేన జాత అశ్రుణా పాన్థేన= రాత్రియందు నీటిమొత్తముచే మందమయిన మేఘముయొక్క శబ్దముచే దిగులుపడినవాఁడును (అందుచేతనే) ఉప్పతిల్లిన కన్నీరుగలవాఁడును (అయిన) యొకానొక ప్రవాసి, ఆత్మ వియోగ దుఃఖ పిశునం తథా గీతమ్=తన విరహ దుఃఖమునకు సూచకముగా అట్లు పాడెను; (ఎట్లు పాడెననఁగా), యథా = ఎట్లు (పాడిన, జీవితహారిణః ప్రవసన ఆలాపస్య సంకీర్తనమ్ ఆస్తామ్=ప్రాణమును హరించునదైన దేశాంతరగమన ప్రస్తావమును ఉచ్చరించుట (అటు) ఉండుఁగాక (అనఁగా దేశాంతర ప్రయాణ మనుమాటనే వదలుకొనుటయే గాక, సరభసం మానస్య అపి లోకేన జల అఞ్జలిః దత్తః = త్వరగా అలుకకు సయితము జనులు నీటి దోసిటిని ఇచ్చిరో అట్లు పాడె నని పూర్వమున కన్వయము.) (అనఁగా ఆ వియోగియొక్క విరహవేదనాసూచక గీతమును విని లోకులు దూరపుఁ బయనములు కట్టుకొన్నవారు ఆ పయనములను స్మరింపక మానుకొన్నారు సరియేఁగదా, అలుకలు దాల్చినవారు సయితము వెంటనే ఆ యలుకలను మానుకొన్నారు.)

అవ॥ కవే ర్వాక్యమ్ - రాత్రా వితి॥ రాత్రౌ నిశి - వారిభరాల సామ్బుదరవో ద్విగ్నేన - వారిణో జలస్య - భరో భారః - తేన - అలసో మన్థరః - సచాసా వమ్బుద శ్చ తస్య - రవో గర్జితం - తేన - ఉద్విగ్నః త్రస్తః - తేన - జాతాశ్రుణా ఉదితబాష్పేణ - పాన్థేన ప్రోషితేన- ఆత్మవియోగదుఃఖపిశునమ్ - ఆత్మన స్స్వస్య - వియోగో విరహః - తేన - దుఃఖం వ్యథా - తస్య పిశునం సూచకం - యథా భవతితథా - ఉత్కణ్ఠయా ఔత్సుక్యేన - తథా తేన ప్రకారేణ - గీతం గానం కృతం - జీవిత హారిణః - ప్రవసనాలాపస్య ప్రవాసకథాయాః - సంకీర్తన ముచ్చారణమ్ - ఆస్తాం తిష్ఠతు-యథా యేన ప్రకారేణ - లోకేన జనేన సరభసం సత్వరం- మాన స్యాపి ప్రణయకోప స్యాపి-జలాఞ్జలి - జలస్య అఞ్జలి ర్నివాప ఇత్యర్థః - దత్త ఇతి సంబన్ధః. తస్య పాన్థస్య తథావిధ మార్తనాదం శ్రుత్వా లోకః క్షణమాత్రవిరహా దపిబిభేతి స్మే త్యభిప్రాయః. దైన్యం నామ సంచారీ భావః. నాయికానాయకవిశేషో న స్ఫుటః. ప్రవాస విప్రలమ్భ శృఙ్గారః. జాతి రలంకారః. ౪౬

---

స్వాం దృష్ట్వా కరజక్షతం మధుమదక్షీబా౽విచా ర్యేర్ష్యయా
గచ్ఛన్తీ 'క్వను గచ్ఛసీ'తి విధృతా బాలా పటాన్తే మయా;
ప్రత్యావృత్తముఖీ సబాష్పనయనా మాముఞ్చ ముఞ్చేతి మాం
కోపప్రస్ఫురితాధరం య దవద త్తత్కేన విస్మార్యతే. ౪౭

మధు మద క్షీబా సా బాలా=మద్యముయొక్క కైపుచేత కైపెక్కిన దయిన యా బాల, స్వాం కరజ క్షతం దృష్ట్వా=తనదైన గోటిగాయమును (నామేనం) గాంచి, అవిచార్య ఈర్ష్యయా గచ్ఛన్తీ = (తాను చేసిన నఖక్షతమే యని) తెలిసికొనక (సవతిచేసినట్టి దని తలంచి) యీసుచేత వెడలిపోవుచు, క్వ ను గచ్ఛసి ఇతి మయా పట అన్తే విధృతా (సతీ) = ఎక్కడికి పోయెదవు అని నాచేత వలువ యంచున పట్టుకొనఁబడినదై, ప్రత్యావృత్త ముఖీ సబాష్ప నయనా = అవలికిమరలిన ముఖముగలది

(యు) కన్నీళ్లతోఁ గూడుకొన్న కన్నులుగలది (యును) (ఐ), ముఞ్చ ముఞ్చ ఇతి = వదలు వదలుము అని, మాం కోపప్రస్ఫురిత అధరం యత్ అవదత్ = నన్ను కోపముచేత అదరుచున్న పెదవి కలుగునట్లుగా ఏమి పలికెనో, తత్ కేన విస్మార్యతే = అది దేనిచే మఱపింపఁబడును (ఎట్లును మఱపింపఁబడ దనుట).

తా.—నా ముగ్ధనాయిక మద్యముచే క్రైపెక్కినదై నామేనం దాను గావించిన గోటిగాయమును సవతి చేసినట్టి దని తలంచి నిజము ఆలోచించికొనక ఈసుచే నన్ను వదలి పోవుచున్నదై, నేను వలువకొనం బట్టుకొని 'ఎటకేఁగెద'వని యడుగఁగా మొగ మవలికిం ద్రిప్పి 'వదలు వదలు' అని నన్ను కోపముచేత మోవి యదరుచుండఁగా ఏమి పలికినదో దానిని ఎట్లును మఱువ శక్యముగాదు.

అవ ॥ నాయకోక్తిః - స్వామితి॥ బాలా తన్వీ - మధుమదక్షీబా - మధునో మద్యస్య - మదేన - క్షీబా మత్తా - భూత్వా - స్వ మాత్మీయ మాత్మనా కృత మిత్యర్థః - కరజక్షతం నఖక్షతం - దృష్ట్వా వీక్ష్య - అవిచార్య స్వేన కృత మిత్యజ్ఞాత్వా - ఈర్ష్య యా సపత్నీకృత మిత్య సూయయా - గచ్ఛన్తీ అపయాన్తీ - క్వ ను గచ్ఛసీతి కుత్ర వ్రజసీతి - మయోక్తః పృచ్ఛాయాం - మయా పటాన్తే చేలాఞ్చలే - విధృతా గృహీతా-సా ప్రత్యావృత్తముఖీ ప్రతినివృత్తవదనా-సబాష్పనయనా సాశ్రునేత్రా-సతీ మాం - ముఞ్చముఞ్చ విసృజ విసృజేతి - కోపప్రస్ఫురితాధరం - కోపేన - ప్రస్ఫురితః కమ్పితః - అధరో యస్మిన్కర్మణి త త్తథో క్తమ్ - అవద దవోచ - దితియత్ త - త్కేన హేతునా - విస్మార్యతే స్మరణం ప్రాప్యతే - కేనాపి విస్మర్తు మశక్య మిత్యర్థ ఇతి సంబన్ధః. స్పష్ట ఏ వాభిప్రాయః. నాయికా స్వీయా మధ్యాప్రగల్భయో రన్యతరా. నాయకోఽనుకూలః. అత్ర ఈర్ష్యాకోపాభిప్రాయం కైశికీవృత్తే రఙ్గం నమః. జాతి రలంకారః. ౮౭

---

చపలహృదయే కిం స్వాతన్త్ర్యా త్త్వయా గృహ మాగత
శ్చరణపతితః ప్రేమార్ద్రార్ద్రః ప్రియ స్సముపేక్షితః
త దిద మధునా యావజ్జీవం నిర స్తసుఖోదయా
రుదితశరణా దుర్జాతానాం సహస్వ రుషాం ఫలమ్. ౪౯

నాయికతో చెలికత్తె నాయకపక్షమున వాదించుచున్నది:— (హే) చపలహృదయే త్వయా ప్రేమ ఆర్ద్రి ఆర్ద్రిః గృహమ్ ఆగతః చరణ పతితః ప్రియః స్వాతన్త్ర్యాత్ కిం సముపేక్షితః=(ఓసి) చంచలాత్మురాలా (ఇట చాపల్యము తోంటిప్రేమను దలంపమియే) నీచేత ప్రేమ (రసము) చేత మిక్కిలి కరఁగినవాఁడు ఇంటికి వచ్చినవాఁడు (నీప్రసాదముకై నీ) పాదములయందు వ్రాలినవాఁడు (నయిన) కాంతుఁడు నీయిచ్చచేత ఏల తిరస్కరింపఁబడియెను (అట్టివానిని ఏల తిరస్కరించితి వనుట), తత్= ఆకారణముచేత, అధునా యావత్ జీవమ్=ఇప్పుడు (ఇఁకను) ప్రాణమున్నంత కాలము, నిర స్త సుఖ ఉదయా రుదిత శరణా (చ సతీ)=పోఁగొట్టుకొనఁబడిన సుఖ ప్రాదుర్భావముకలదానవు (ను) ఏడుపే రక్షకముగాఁగల దానవు (ను గా), దుర్జాతానాం రుషామ్ ఇదంఫలం సహస్వ = దుష్టములయిన కోపములయొక్క యీపరిపాకమును అనుభవింపుము.

ఇదమ్ - అనుటచేత నాయిక యిప్పటికే పశ్చాత్తాపతప్తురాలై ఏడ్చుచున్నదని తెలియ నగుచున్నది.

అవ॥ నాయకేన భేదోపాయం గమితా సఖీ నాయికా ముపాలభతే చపలహృదయ ఇతి॥ చపలహృదయే చఞ్చలచిత్తే అత్ర చాపలేన అవిమృశ్యకారిత్వం వివక్షితం - తథా తేన ప్రకారేణ - ప్రేమార్ద్రార్ద్రః - ప్రేమ్ణాప్రియత్వేన-ఆర్ద్రార్ద్రః అత్యన్తమార్ద్రస్సరసః - ప్రియః వల్లభః- గృహం భవన - మాగతః ప్రాప్త - శ్చరణ పతిత స్సన్ - స్వాతన్త్ర్యాత్ స్వచ్ఛన్దత్వాత్ - కిం సముపేక్షితః కి మర్థం మవధీరితః - తత స్తస్మాత్కారణాత్ - ఇదానీం - యావజ్జీవం జీవితావధి - నిర స్తసుఖోదయా

అపాకృతసుఖప్రాప్తిః - రుదితశరణా రోదనాలబ్ధనా సతీ - దుర్జాతానాం దుష్టానాం- రుషాం రోషాణా- మిదం- ఫలం పరిపాకం- సహస్వ క్షమ - స్వేతి సంబన్ధః. అత్ర నాయికా స్వీయా మధ్యా చ; కించ కలహాన్తరితా - యథోక్తం భారతీయె—

> 'సేర్ష్యైః కలహనిష్క్రాన్తో యస్యా నాగచ్ఛతి ప్రియః
> సా పశ్చాత్తాపసంతప్తా కలహాన్తరితా భవేత్;
> చిన్తానిశ్వాసఖేదై శ్చ హృత్తాపాఽభినయేన చ
> సఖీనాం విప్రలాపై శ్చ ఆత్మావస్థావలోకనైః,
> గ్లానిదైన్యాశ్రుపాతై శ్చ రోగస్యాగమనేన చ,
> విభూషణాతనుత్వేన దుఃఖేన రుదితేన చ,
> ఖణ్డితా విప్రలబ్ధా చ కలహాన్తరితాభవేత్,
> తథా ప్రోషితకాన్తా చ; భావై రేవం ప్రయోజయేత్.' ఇతి.

అత్ర నాయకశ్శఠః. సోపాలమ్భవచనం నర్మ. ఆక్షేపోఽలంకారః. ౮౪

---

> నభసి జలదలక్ష్మీం సాస్రయా వీక్ష్య దృష్ట్యా
> ప్రవససి యది కాన్తే త్యర్ధ ముక్త్వా కథంచిత్
> మమ పట మవలమ్బ్య ప్రోల్లిఖన్తీ ధరిత్రీం
> య దను కృతవతీ సా తత్ర వాచో నివృత్తాః. ౮౫

సా=ప్రియ, నభసి జలద లక్ష్మీం సాస్రయా దృష్ట్యా వీక్ష్య=ఆకాశమున మేఘముల సొంపును అస్రములతో (బాష్పములతో) కూడుకొన్న చూపుతోచూచి, కాన్త ప్రవససి యది ఇతి=ప్రియుఁడా ప్రవసింతు వేని (దేశాంతరప్రయాణము చేసెదవేని) అని, కథఞ్చిత్ అర్ధమ్ ఉక్త్వా=ఎట్లో (కష్టపడి) సగము (మాటను) పలికి, మమ పటమ్ అవలమ్బ్య ధరిత్రీం ప్రోల్లిఖన్తీ అను యత్ కృతవతీ తత్ర వాచః నివృత్తాః=నా వస్త్రమును పట్టుకొని నేలను (కాలిబొట్టనవ్రేలితో) గీఱుచు అనంతరము ఏమి చేసినదో

ఆవిషయమున మాటలు వెనుకకు మఱలినవి (ఆ యనుభావవిశేషములను వర్ణింప నలవిగాదనుట.)

సాస్రయా - కన్నీళ్లు విరహిమారకమయిన మేఘోదయముచేత. అర్ధమ్- సగమే చెప్పుట (అంతయుం జెప్పజాలమి) భావి వియోగ దుఃఖ సాగరములో మునింగినందున. కథఞ్చిత్-ఆయర్ధమునైనను చెప్పుట ప్రయాస కారి యగుటకు ఆదుఃఖమే కారణము. వాచో నివృత్తాః-నాహృదయమున ఆతీరు నాటుకొనియున్నది, వాక్రువ్వం దరముగాదు, అనుట.

అవ॥ నభసీతి॥ నభసి ఆకాశే-జలదలక్ష్మీం మేఘసామగ్రీం-సాస్రయా సబాష్పయా- దృష్ట్వా దృశా - వీక్ష్య అవలోక్య - హే కాన్త ప్రియ- ప్రవససియది ప్రవాసం కరోషిచేత్ - ఇతి కథంచి త్కృచ్ఛ్రేణ - అర్ధం సావశేషం వాక్య మితి శేషః-ఉక్త్వా భాషిత్వా-మమ-పట మంశుక-మవలమ్బ్యగృహీత్వా-ధరిత్రీం భువం-ప్రోల్లిఖన్తీ కషన్తీ-అను పశ్చా-త్సాయత్ కర్మ కృతవతీ - తత్ర తస్మిన్ కర్మణి - వాచ ఉక్తయః - నివృత్తాః వ్యావృత్తా ఇతి సంబన్ధః. య త్కృతవ తీత్యత్ర - యచ్ఛబ్దవాచ్యైః నిశ్శ్వాస వైవర్ణ్య బాష్పగద్గదాదిభిః అనుభావై 'స్త్వాంవినా క్షణ మపి జీవితు మహం నశక్నో మీ'త్యయ మర్థః 'ప్రవససి యదీ' త్యస్య వాక్య శేషత్వే నావగన్తవ్యః. తత్ర వాచో నిరస్తా - ఇత్యనేన నాయికాయా శ్చిన్తానిశ్వాసాదీనా మనుభావానాం దశావిశేషః పశ్యతాం మనోగోచర ఏవ న వాగ్గోచర ఇత్యర్థో గమ్యతే. దైన్యం నామ సంచారీ భావః. నాయికా స్వీయా మధ్యా చ. నాయకో౽నుకూలః. భవిష్యత్ప్రవాసవిప్రలమ్భశృఙ్గారః. అత్ర నర్మస్ఫోటః. జాతి రలంకారః. ౪౯

---

బాలే,నాథ, విముఞ్చ మానిని రుషం, రోషాన్మయా కిం కృతం?
ఖేదో౽స్మాసు.న మే౽పరాధ్యతిభవాన్,సర్వే౽పరాధా మయి
తత్కిం రోదిషి గద్గదేన వచసా? కస్యాగ్రతో రుద్యతే?
నన్వేత న్మమ. కా తవాస్మి? దయితా.నాస్మీ త్యతో రుద్యతే.

నాయకుఁడు.—బాలే = (ఓ) పిల్లా; నాయిక.—నాథ = (ఓ) దొరా; నాయ.—మానిని రుషం విముఞ్చ = ఓకోపనురాలా కోపమును మానుము; నాయి.—రోషాత్ మయా కిం కృతమ్ కోపమువలన నాచేత నేమిచేయఁబడినది (నే నేమికోపకార్యము చేసితిని, నన్నుఁగోపము మాను మనుటకు? అనుట); నాయ.—అస్మాసు ఖేదః=మామీఁద ఆయాసము (ఆయాసపడుటయే); నాయి.—భవాన్ మే న అపరాధ్యతి=నీవు నాకు అపరాధము నొనర్పలేదు, సర్వే అపరాధాః మయి (వర్తన్తే)=సకలమయిన నేరములును నాయందు (కలవు) (నీవు నాకేమియు ఎగ్గుచేయలేదే, అన్ని తప్పులను నేనే గదా చేసితిని); నాయ.—తత్ గద్గదేన వచసా కిం రోదిషి = అటయిన డగ్గుత్తికగల మాటతో (డగ్గుత్తికతో పలుకుచు) ఏల యేడ్చెదవు? నాయి.—కస్య అగ్రతో రుద్యతే = ఎవనియెదుట ఏడ్చుట (నే నెవని యెదుట నేడ్చితిని)? నను ఏతత్ మమ అగ్రతః = ఓసి యిదే నా మ్రోలను; నాయి.—తవ కా అస్మి=నీకు (నేను) ఏమి అగుదును; నాయ.—దయితా = ప్రియవు; నాయి.—న అస్మి ఇతి అతః రుద్యతే=(ప్రయోగవ్యత్యయము.) కాను అనెడి యీ కారణంబువలన ఏడ్చుచున్నాను.

ఈనాయిక తన్ను నాయకుఁడు 'దయితా' అని పిలువక చేటినో ఎవతెనో పిలిచినట్లు 'బాలా' అని పిలిచినందున తనమీఁది ప్రేమ సవతులపాలై పోయెఁగదా యని కుందు గలిగి ప్రతిసంబోధన 'వల్లభా' 'ప్రాణేశ్వరా' అనునిట్టి యనురాగసూచకపదమున చేయక 'పోషకుఁడా' అను నభిప్రాయముగా 'నాథ'అని చేసి ఏడ్చుచుండినది. ఏల యేడ్చెద వని కడపట నతఁడడుగఁగా దయితను కా ననియె యేడ్చుచున్నాను అని యుపసంహరించినది.

ఇట వేమారెడ్డిగారి వ్యాఖ్యలో నాయిక ఖండితగా వివరింపఁబడినది. ఖండిత యనుట యుక్తియుక్తముగా నుండలేదు; నాయికాఖేదమునకు బాలాపదసూచిత భర్తృనిరనురాగమే కారణముగా గ్రహించుట సమంజసము.

అవ॥ నాయికానాయకయో రుక్తిప్రత్యుక్తిరూపా వాక్యమాలా-
బాలఇతి ॥ హే బాలే ముగ్ధే - నాథ స్వామిన్ - హే మానిని హే
కోపనే - రుషం కోపం - విముఞ్చ త్యజ - మయా రోషాత్కిం కృతం -
కి మాచరిత - మస్మాసు ఖేదః క్లేశః కృత ఇతి శేషః - భవాన్మహ్యం
నాపరాధ్యతి న ద్రుహ్యతి॥ సూ॥ క్రుధద్రుహేర్ష్యాదినా చతుర్థీ - మయి-
సర్వే సకలా అపరాధా స్సన్తి - తస్మా ద్ధేతోః - కిం గద్గదేన స్ఖలితేన -
వచసా వాచా రోదిషి రోదనం కరోషి - కస్య - అగ్రతః పురః రుద్యతే
రోదనం క్రియతే-మమ అగ్రత ఏత దిదం రోదనం క్రియతే-త వాహం
కాఽస్మి-దయితా ప్రియా భవసి-నాస్మి న భవామి-త్యతః కారణాత్
రుద్యత ఇతి సంబన్ధః. అత్ర ప్రగల్భాయాం 'బాలే' ఇత్యామన్త్రణం
నాయకేన వక్రోక్త్యా కృతం, తయాపి తత్ జ్ఞాత్వా తథైవ వక్రోక్త్యా
ప్రియం ప్రతి నాథే త్యామన్త్రణం కృతం, తత స్తేన ఆర్జవ మాలమ్బ్య
'మానిని రుషం ముఞ్చ' త్యనునయః కృతోఽనుసంధేయః, తత స్తయా
వక్రోక్త్యైవ 'రోషాన్మయా కిం కృత మి' త్యుత్తరం దత్తం, తత స్తేన
'ఖేదోఽస్మాసు కృత' ఇత్యుక్తం, తత స్తయా 'అపరాధిని ఖలు ఖేదః
క్రియతే-భవాన్నాపరాధ్యతి-కుతః ఖేద' ఇతి-విపరీతలక్షణయా భవా నప
రాధీ ఖేదః కథం న కర్తవ్య ?' ఇతి సూచితమ్, తత స్తేన 'సర్వేఽప
రాధా మయీ' త్యపరాధాఙ్గీకారేణ 'రుషం ముఞ్చ' త్యనునయః ప్రకటీ
కృతః, తత స్తయా-త 'తస్మా ద్రోషస్య మోచనాత్కిం కృత మి'
త్యుక్తం, తత స్తేన 'గద్గదేన వచసా ఖేదమూలం రోదనం కరోషీ'
త్యుక్తం, తత స్తయా 'కస్యాగ్రతో రుద్యత' ఇత్యనేన 'సంబన్ధతః ఖలు
రోదనస్య ఖేదమూలత్వం - మమ కో భవా ని'త్యుక్తం, తత స్తేన తస్యా
వక్రోక్త్యభిప్రాయం విజ్ఞాయ అజానతేవ 'న న్వేతన్మ మాగ్రత' ఇ
త్యుత్తరం దత్తం, తత స్తయా 'పురతో రోదితు మహం తవ కాస్మీ'
త్యుక్తం, తత స్తేన 'మమ త్వం దయితే' త్యుక్తం, తతః తయా 'దయి
తైవ నాస్మీ త్యతః కారణాన్మయా రుద్యత ' ఇత్యుక్త మి త్యవగన్త

వ్యమ్. అత్ర నాయికా స్వీయా - ధీరా ప్రగల్భా చ. కిం చ ఖణ్డితా - యథోక్తం భారతీయె-

'అన్యాసఙ్గా త్స్వముచితే వాసకే నాగతః ప్రియః
యస్యా స్సా మానదుఃఖార్తా ఖణ్డితే త్యభిధీయతే.' ఇతి.

నాయక శ్శఠః. అత్ర మానకృతం వాగ్రూపం శృఙ్గారి నర్మ. వాకోవాక్యాలంకారః 'ఉక్తిప్రత్యుక్తిమ ద్వాక్యమ్ వాకోవాక్యం ప్రచక్షతే' ఇ త్యుక్తత్వాత్. ౫౦

---

శ్లిష్టః కణ్ఠే కి మితి న మయా మూఢయా ప్రాణనాథ?
శ్చుమ్బ త్యస్మిన్ వదనవినతిః కిం కృతా? కిం న దృష్టః?
నో క్తః క స్మా? దితి నవవధూచేష్టితం చిన్తయన్తీ
పశ్చాత్తాపం వహతి తరుణీ ప్రేమ్ణి జాతే రసజ్ఞా. ౫౧

నాయిక మున్ను తాను నవోఢగా నున్నప్పుడు తాను ఆలింగన చుంబనాదికంబులందు పయికొనక లజ్జచే ఆత్మవంచనము చేసికొంటి నని ఇప్పుడు తరుణియై రసజ్ఞయయి పశ్చాత్తాపము పొంది తన్ను నిందించు కొనుట:—(ప్రయోగవ్యత్యయము.—) తరుణీ=జవ్వని, ప్రేమ్ణిజాతే (సతి) రసజ్ఞా-మక్కువ కలుగఁగా (లజ్జయెడలి ప్రేమ తెల్లముకాఁగా) సంభోగ రసము నెఱింగినదై, మూఢయా మయా ప్రాణనాథః కిమ్ ఇతి కణ్ఠేన శ్లిష్టః= తెలివి మాలినదానను నేను జీవితేశ్వరుని ఏల యని మెడయందు కవుంగిలించుకో నయితిని, అస్మిన్ చుమ్బతి (సతి) వదన వినతిః కిం కృతా= అతఁడు ముద్దుపెట్టుకొనుచుండఁగా మొగము వంచుటను ఏల చేసితిని (ఏల మొగమును వంచుకొంటిని), కిం న దృష్టః=ఏల (అతనిని) చూడనయితిని, కస్మాత్ న ఉక్తః=(అతనితో) ఏల పలుకనయితిని, ఇతి నవవధూ చేష్టితం చిన్తయన్తీ పశ్చాత్ తాపం వహతి- ఇట్లని తాను క్రొత్తపెండ్లికూఁతురుగా నున్నప్పటి(తన)చేఁతను తలపోయుచున్నదై అనుతాపమును పొందుచున్నది.

అవ ॥ పూర్వం ముగ్ధ్యేవ వఞ్చితాఽస్మీతి పశ్చాత్తాపం గతయాః నాయికాయా ఆత్మోపాలమ్భం కవి రాహ- శ్లిష్ట ఇతి ॥ తరుణీ యువతిః- ప్రేమ్ణి ప్రణయే- జాతే సంభూతే సతి - లజ్జావరణం విహాయ ప్రకాశమాన ఇత్యర్థః-రసజ్ఞా రుచిజ్ఞా - సంభోగసౌఖ్యం విశేషేణ జానతీ త్యర్థః- తదానీం-మూఢయా అజ్ఞయా-మయా- ప్రాణనాథః ప్రాణేశ్వరః - కి మితి కణ్ఠే న శ్లిష్టః నాలిఙ్గితః-కిం చ అస్మిన్ ప్రాణనాథే - చుమ్బతి చుమ్బనం- కుర్వతి సతి- వదనవినతిః ముఖవినమనం- కిం కృతా కిమర్థ మాచరితా - కిం చ ప్రాణనాథః-కిం న దృష్టః కి మితి నావలోకితః-కించ కస్మా ద్ధేతోః- నోక్తో న సంభాషిత - ఇత్యనేన ప్రకారేణ-నవవధూచేష్టితం నవోఢావ్యాపారమ్ - ఆత్మీయ మితి శేషః - చిన్తయన్తీ స్మరన్తీ - పశ్చాత్తాప మనుశయ మేతావన్తం కాలం ముగ్ధ్యేవ వఞ్చితా స్మీతి ఏవం రూపం - వహతీతి సంబన్ధః. అత్ర నాయికా స్వీయా మధ్యా. నాయకోఽనుకూలః. సంభోగశృఙ్గారః. అనుశయాక్షేపాలంకారః. స్పష్ట ఏవాభిప్రాయః. ౫౧

---

వాన్తై ర్లోచనవారిభిః సశపథైః పాదప్రణామైః ప్రియై
రన్యై స్తా వినివారయన్తి కృపణాః ప్రాణేశ్వరం ప్రస్థితమ్;
ధన్యాఽహం; వ్రజ మఙ్గళం సుదివసం ప్రాతః ప్రయాతస్య తే;
య త్స్నేహోచిత మీహితం ప్రియతమ త్వంనిర్గత శ్శ్రోష్యసి.

నాయకుని పయనమును నాయిక వక్రోక్తిచే ఆఁపుచున్నది:-వాన్తైః లోచన వారిభిః = జాఱిన కన్నీళ్ల చేతను, సశపథైః పాదప్రణామైః=ఒట్టులతోఁ గూడుకొన్నచరణ నమస్కారములచేతను, అన్యైః ప్రియైః=ఇతరమయిన యిష్టకృత్యములచేతను, తాః కృపణాః ప్రస్థితం ప్రాణేశ్వరం వినివారయన్తి = ఆ దీనురాండ్రు పయనమయిన జీవిత నాయకుని ఆఁపుదురు, ప్రియతమ అహం ధన్యా-అత్యంతప్రియుఁడా నేను కృతార్థురాలను, ప్రయాతస్య తే ప్రాతః మఙ్గళం సుదివసమ్=బయలువెడలినట్టి నీకు వేకువ శుభమైన

మంచిదినము (మంచిసమయము), వ్రజ=పొమ్ము, త్వం నిర్గతః(సన్)=నీవు బయలువెడలినవాఁడవై (తరలినంతనే), మయా స్నేహ ఉచితం యత్ ఈహితం తత్ శ్రోష్యసి=నాచేత ప్రేమకు తగినది ఏది కోరఁబడుచున్నదో దానిని వినియెదవు (నామృతిని వినియెదవని భా.)

పయనమయిన కాంతులను ఇతరలు ఏడ్చి ఒట్టులు పెట్టి పాదములకు మ్రొక్కి ఇంక నేమేమో ఇచ్చకువచ్చినవి చేసి ప్రయాణమునుండి మాన్పుదురు. నేను అట్లు చేయను నీకు వేకువ ఇదే ప్రయాణమునకు మంచి శుభసమయము. నీవు పొమ్ము. నీవు తరలినంతనే నా ప్రేమకు తగిన పనిని నేను చేసెదను. నీవును వెంటనే విందువు.—అనుట.

అవ॥ ప్రయాస్యన్తం నాయకం నాయికా వక్రోక్త్యా నివారయతి-వాష్పైరితి॥ వాష్పైర్నిర్గతైః - లోచనవారిభిః నేత్రజలైః - సశపథైః శపథసహితైః - పాదప్రణామైశ్చేత్యర్థః-అన్యైః-ప్రియైః ఇష్టకరణైశ్చాపి-తాః-కృపణా దీనాః - ప్రస్థితం ప్రయాణోద్యుక్తం - ప్రాణేశ్వరం ప్రాణనాథం - వినివారయన్తి. అహం తు-ధన్యా పుణ్యా అకృపణేత్యర్థః- ప్రయాతస్య ప్రయాతుముద్యుక్తస్య - తే - ప్రాతఃకాలే సుదివసం శోభనం దినం తథైవ మాఙ్గళ్యకారి - వ్రజ గచ్ఛ - ప్రియతమ త్వం నిర్గతస్సన్ మయా - స్నేహోచితం - స్నేహస్య ప్రేమ్ణః - ఉచిత మర్హం - యదీహిత మాచరితం - త - చ్ఛ్రోష్యసి ఆకర్ణయసీతి సంబన్ధః. అత్ర స్నేహోచిత మీహితం శ్రోష్యసీత్యనేన ఆత్మనో భావినీమ్ విపత్తిం సూచయిత్వా ప్రియస్య గమనం నిషేధయతీ త్యభిప్రాయః. నాయికా స్వీయా ప్రగల్భా చ. నాయకోఽనుకూలః. భావిప్రవాసవిప్రలమ్భశృఙ్గారః. సోపాలమ్భవచనం నర్మ. ఆక్షేపోఽలఙ్కారః. ౫౩

---

లగ్నా నాంశుకపల్లవే భుజలతా, నో ద్వారదేశే స్థితం,
నో వా పాదయుగే ముహుర్నిపతితం, తిష్ఠేతి నోక్తం వచః,

కాలే కేవలమమ్బుదాళిమలినే గన్తుం ప్రవృత్తశ్శఠః
తన్వ్యా బాష్పజలౌఘకల్పితనదీపూరేణ రుద్ధః ప్రియః. ౫౩

భుజలతా అంశుక పల్లవే న లగ్నా — (నాయికయొక్క) కైదీఁగ (ప్రియునియొక్క) వలువ చిగురునందు తగులదాయెను. (అనఁగా పయనమై పోవుచున్న నాయకుని నాయిక అతనివస్త్రమును పట్టుకొని ఆఁపదాయెను), (ప్రయోగవ్యత్యయము.—) ద్వారదేశే నోస్థితమ్ = (నాయిక) కడపకడ (పోనీక అడ్డము) నిలువదాయెను, పాదయుగే ముహుఃనో నిపతితమ్ = (ప్రియుని) యడుగులజంటయందు మాటిమాటికి పడదాయెను, తిష్ఠ ఇతివచః న ఉక్తమ్=నిలువుము (పోవలదు) అని మాటను పలుకదాయెను, అమ్బుద ఆళిమలినే కాలే గన్తుం ప్రవృత్తః శఠః ప్రియః= మేఘముల పంక్తులచే నల్లనయిన కాలమందు పోవుటకు ఉద్యమించినవానిని ధూర్తుఁడైన వల్లభుని, తన్వ్యా కేవలం బాష్పజల ఓఘకల్పిత నదీ పూరేణ రుద్ధః=సుందరి ముఖ్యముగా కన్నీటి ప్రవాహములతో సృజింపఁబడినయేటి వెల్లువచేత ఆఁపినది.

ఒకానొకకాంత మేఘపంక్తులచే మలినమయిన కాలమున (అనఁగా విరహులకు అత్యంత మదనోద్దీపకమై మారకమయిన వర్షర్తువునందు) పయనమయిన వంచకుని ప్రియుతముని పోనీయక ఆఁపుటకు—గుడ్డపట్టి లాగలేదు, ద్వారమున అడ్డముగా నిలువలేదు, పాదములకు పలుమాఱు మ్రొక్కి—పోవలదని వేఁడుకొనలేదు, పోవలదని మాట నేనియు పలుకలేదు; మఱియేమన, ఏడ్చి ఆఁపినది, అని తా.

అవ॥ కవేర్వాక్యమ్ - లగ్నేతి॥ అంశుకపల్లవే ప్రియస్య చేలాఞ్చలే- భుజలతా నాయికాయా దోర్వల్లరీ - న లగ్నా న సక్తా - ద్వారదేశే ద్వారస్థలె - న స్థితం నోషితం - భావె నిష్ఠా - పాదయుగె ప్రియస్య చరణద్వన్ద్వే వా - మహుముఃఞ్హుః పునఃపునః - న నిపతితం న ప్రణతం- తిష్ఠేతి - వచో వా వచనం వా - నోక్తం నోదీరితమ్ - అమ్బుదాళిమలినే

మేఘపటలశ్యామే - కాలే సమయే - గన్తుం ప్రయాతుం - ప్రవృత్తః ఉద్యుక్తః - శఠః అనృజుః అయుక్తకారీత్యర్థః - ప్రియో వల్లభః - తస్యాః కాన్తయా - కేవలం బాష్పజలౌఘకల్పితేన నదీపూరేణ అశ్రుసలిలసమూహసంపాదితతటినీప్రవాహేణ - కేవలం శబ్దోఽవధారణే - పూరేణైవే త్యర్థః - రుద్ధో వారిత - ఇతి సంబన్ధః. అభిప్రాయో వ్యక్త ఏవ. దైన్యం నామ సంచారీభావః. నాయికా స్వీయా మధ్యా చ. నాయకోఽనుకూలః ఆక్షేపరూపం చేష్టాకృతం శృఙ్గారి నర్మ. ఆక్షేపోఽలంకారః. ౫౩

---

విరహావిషమః కామః కామం తనుం కురుతే తనుం,
దివసగణనాదక్షః స్వైరం వ్యపేతఘృణో యమః,
త్వ మపి వశగో మానవ్యాధే ర్విచిన్తయ నాథ హే
కిసలయ మృదు ర్జీవే దేవం కథం ప్రమదాజనః! ౫౪

సఖి నాయకుని మందలించుచున్నది—కామః విరహ విషమః తనుం కామం తనుం కురుతే = మన్మథుఁడు వియోగమందు క్రూరుఁడు (వియోగులను నొంచువాఁడు) దేహమును మిక్కిలి కృశమునుగాఁ జేయును, యమః స్వైరం వ్యపేత ఘృణః (సన్) దివస గణనా దక్షః = యముఁడు యథేచ్ఛముగా (వ్యపేత=) నష్టమైన (ఘృణః=) కరుణగలవాఁడు అయి దినములను లెక్కించుటయందు సమర్థుఁడు (చంపవలసిన దినమున చంపకమానఁ డనుట), హే నాథ త్వమ్ అపి మాన వ్యాధేః వశగః=ఓ సామీ నీవు ను రోషమనెడు రోగమునకు అధీనుఁడవు, ఏవం (సతి) కిసలయ మృదుః ప్రమదా జనః కథం జీవేత్ విచిన్తయ = ఇట్లుండఁగా చిగురువలె కోమలమైన కాంతా జనము ఎట్లు బ్రదుకును ఆలోచింపుము. నీ విట్లు కింకవహించిన నీప్రియ యీవియోగభరముచే నాసిల్లి మృతి నొందునని భా.

అవ॥ సఖీ నాయక ముపాలభతే _ విరహావిషమ ఇతి ॥ కామో

మన్మథః - విరహ విషమః - విరహే విప్రయోగే - విషమో వక్రః క్రూర స్సన్ ఇత్యర్థః - కామం ప్రకామం - తనుం శరీరం - తనుం కృశాం - కురుతే విధత్తే - యమః కృతాన్తః - స్వైరం యథేచ్ఛం - వ్యపేత ఘృణః అపగత దయ స్సన్ - దివస గణనా దక్షః దివస సంఖ్యాయాం పటుః - మారణవ్యగ్ర ఇత్యర్థః - హే - నాథ స్త్వమిన్ - త్వ మపి - మానవ్యాధేః - మాన ఈర్ష్యాకోప స్స ఏవ - వ్యాధి రామయః - తస్య నాయికాయా ఇతి శేషః - వశగః వశవర్తీన్ - మానవ్యాధిం శమయితుం నోద్యుక్త ఇత్యర్థః - ఏవ మిత్థం - సతి - కిసలయ మృదుః ప్రవాళ కోమలః - ప్రమదాజనః - కథం కేన ప్రకారేణ - జీవేత్ ప్రాణాన్ ధారయేత్ - విచిన్తయ విచార యేతి సంబన్ధః. 'కథం జీవేచ్చిన్తయే' త్యనేన ఔదాసీన్యం విహాయ శీఘ్రం తాం ప్రసాద్య కృతార్థాం కురు ష్వేత్యభిప్రాయః. అత్ర సంజ్వరో నామ దశావిశేషోఽవగమ్యతే. నాయికా స్వీయా మధ్యా చ. కించ కలహాన్తరితా. నాయక శ్శఠధృష్టయో రన్యతరః. మానకృతవిప్రలమ్భశృఙ్గారః. అత్ర సోపాలమ్భవచనం నర్మ. ఆక్షేపాలంకారః. ౫౪

---

పరిమ్లానే మానే, ముఖశశిని తస్యాః కరధృతే,
మయి క్షీణోపాయే ప్రణిపతనమాత్రైకశరణే.
తదా పక్ష్మప్రాన్త వ్రజపుటనిరుద్ధేన సహసా
ప్రసాదో బాష్పేణ స్తనతటవిశీర్ణేన కథితః. ౫౫

క్షీణ ఉపాయే మయి ప్రణిపతన మాత్ర ఏక శరణే (సతి)=క్షయించిన సామాద్యుపాయములుగల నేను అడుగులకు మ్రొక్కుట యొకటియే రక్షకముగా, గలవాఁడను కాఁగా (అలిగినకాంతను నేను మంచిమాటల సమాధానపఱుచుకొన నేరక తదీయపాదములయందు వ్రాలి యుండఁగా), తస్యాః మానే పరిమ్లానే (సతి) ముఖ శశిని కరధృతే (సతి)=ఆకాంత

యొక్క అలుక సడలినది కాఁగా (శశిని=) చంద్రునివంటి తన్ముఖము చేతి యందు ఉంచుకొనఁబడినది కాఁగా (కొంత యలుక సడలి చెక్కిలి కేలం గీలించి యుండఁగా), తదా పక్ష్మ ప్రాన్త వ్రజ పుట నిరుద్ధేన స్తన తట విశీర్ణేన బాష్పేణసహసా ప్రసాదః కథితః=ఆసమయమందు ఱెప్పల తుదల యొక్క మొత్తంపు సంపుటమందు ఆఁపఁబడినట్టియు చను దరులయందు చిద్రుపలైనట్టియు కన్నీటిచేత తటాలున అలుక తీరుట చెప్పఁబడినది.

నే నెప్పాటను అలుక దీర్పనేరక పాదములఁ ద్రెళ్లినంతట కొంత మోమును చేత నిడికొని యుండఁగా తటాలున తదీయబాష్పము క్రమముగా తొంగలి ఱెప్పలతుదల నాఁగి, అనంతరము చనుగట్లపయింబడి చిద్రుపలై చెదరినది; ఆ బాష్ప దర్శనముచేత అలుక తీఱెఁ గదా యని తెలిసికొంటిని.

'పక్ష్మ - నిరుద్ధ' అనుటచే దట్టంపుఱెప్పలు సూచితములు. దట్టంపు ఱెప్పలు సుందరంబులును సులక్షణంబును; వ్రేలుచన్నులందు నీటిబొట్లు చిద్రుపలుగావు, చిద్రుపలైనట్లువర్ణించినందున బిగువుచన్నుల జవరా లని తెలియనగుచున్నది.

అవ ॥ నాయకోక్తిః-పరిమ్లాన ఇతి ॥ క్షీణోపాయే విగతసామాద్యు పాయే - మయి - ప్రణిపతనమాత్రైకశరణే సతి-ప్రణిపతనమాత్రం ప్రణామ - ఏకం ముఖ్యం - శరణం యస్యస తథోక్తః తస్మిన్ - పరిమ్లానే మానే తస్యాః కోపే శ్లథే సతి - ముఖశశిని ముఖచన్ద్రే - కరధృతే హస్త ధారితే సతి - పక్ష్మప్రాన్తవ్రజపుటనిరుద్ధేన - పక్ష్మణాంప్రాన్తా అగ్రాణి - తేషాం - వ్రజ స్సమూహః - స ఏవ పుటప్రాన్తః తేన - నిరుద్ధోనివారితః - తేన స్తన తటవిశీర్ణేన కుచప్రాన్త జర్జరేణ బాష్పేణాశ్రుణా - సహ సా శీఘ్రం - ప్రసాదః ప్రసన్నతా - కథితః ఉక్త - ఇతి సంబన్ధః. కోప భావశాన్తిః. నాయికా స్వీయా మధ్యా చ. నాయక శ్శఠః. జాతి రలంకారః. ౫౫

కృతో దూరా దేవ స్మితమధుర మభ్యుద్గమవిధిః,
శిర స్యాజ్ఞా న్యస్తా, ప్రతివచన మ ప్యాలపసి చ,
న దృష్టి శ్శైథిల్యం ; జత ఇతి చేతో దహతి మె,
నిగూఢా న్తర్గకోపే కఠినహృదయే సంవృతి రియమ్. ౫౬

నాయకుఁడు నాయికను నిందించుట.—దూరాత్ ఏవ స్మిత మధురం (యథా తథా) అభ్యుద్గమ విధిః కృతః=దూరమునుండి యే చిఱునవ్వుచేత మనోహర మగునట్లుగా ఎదురుగాలేచివచ్చు కార్యము చేయఁబడినది, శిరసి ఆజ్ఞా న్యస్తా. ఔదలను (నా) యాజ్ఞ ఉంపఁబడినది, ప్రతివచనమ్ అపి ఆలపసి=(నామాటకు) ఉత్తరమును సయితము పలుకుచున్నావు, (అయినను), దృష్టిః శైథిల్యం న భజతే ఇతి యత్ = (నీ) చూపు సడలుటను పొంద దాయెననుట యేది (కలదో) అది, మే చేతః దహతి=నాహృదయమును కాల్చుచున్నది, నిగూఢ అన్తః కోపే. దాఁపఁబడిన లోని కోపము గలదానా, (హా), కఠిన హృదయే=(ఓ) నిష్ఠుర చిత్తురాలా, ఇయం సంవృతిః ,ఈనడవడి (నిజమయిన భావమును) దాఁచుట.

తా.—దూరమునుండి మందహాసముతో లేచి నా కెదురు వచ్చితివి, నాయాజ్ఞలను ఔదలం దాల్చితివి, నామాటలకు చక్కఁగానే బదులు పలుకుచున్నావు, అయినను నీచూపులు మాత్రము తీక్ష్ణతను వదలకున్నవి. ఇది కఠినహృదయతచే కోపమును లోలోపల దాఁచుకొనుప్రకారము; కావున ఇందువలన నాకు మిక్కిలి పరితాపము కలుగుచున్నది.

అవ॥ నాయకో నాయికా ముపాలభతే_కృత ఇతి॥ దూరా దేవ దూరతఏవ - స్మితమధురం మందహాస మనోహరం యథా భవతి తథా - అభ్యుద్గమవిధిః ప్రత్యుత్థా నాచరణం - కృతో విహితః - కిం చ - ఆజ్ఞా మమ శాసనం - శిరసి మస్తకే - న్యస్తా విహితా - యద్య థోక్తం తత్త థాఙ్గీకృత మి త్యర్థః - ప్రతివచన ముత్తర - మపి - ఆలపసి బ్రవీషి - మయి భాషమాణే స తీతి శేషః - తథాపి తే - దృష్టి ర్దర్శనం - శై

థిల్యం శ్లథతాం - న భజతే న ప్రాప్నో - తీతి యత్ కోపదార్ఢ్యం న జహాతీత్యర్థః - తచ్ఛైథిల్యాభజనం - మే మమ - చేతో దహతి చిత్తం సంతాపయతి - హే నిగూఢాన్తఃకోపే - నిగూఢో గుప్తః - అన్తఃకోపో యస్యాస్సా తథోక్తా తస్యాస్సంబుద్ధిః - కఠిన హృదయె నిష్ఠుర చిత్తే - ఇయం - పూర్వోక్తప్రతుద్గమాదివిధిః - సంవృతి రాకారగోపన - మితి సంబన్ధః. అవహిత్థం నామ సంచారీ భావః. నాయికా స్వీయా ధీరా ప్రగల్భా చ. నాయక శ్శఠః. అత్ర సోపాలమ్భవచనం నర్మ. స్ఫోటా(?) లంకారః. ౫౬

---

ఆస్తాం విశ్వసనం సఖీషు, విదితాభిప్రాయసారే జనే,
తత్రాఽప్యర్పయితుం దృశం సలలితాం శక్నోమి న వ్రీడయా,
లోకోఽప్యేష పరోపహాసచతుర, స్సూక్ష్మేఙ్గితజ్ఞోఽప్యలం,
మాతః కం శరణం వ్రజామి, హృదయే జీర్ణోఽనురాగానలః.

తనయనురక్తిని ప్రియుని కెఱింగింప వెరవు గానని నాయిక దాదితో మొఱపెట్టుకొనుట. — సఖీషు విశ్వసనమ్ ఆస్తామ్ = చెలులయందు నమ్మకము అటుండుఁగాక (చెలులు నాకై పోయి యతనిం బొంది వచ్చిన వంచకురాండ్రు అనుట), విదిత అభిప్రాయసారే తత్ర జనే సలలితాం దృష్టిమ్ అర్పయితుమ్ అపి వ్రీడయా న శక్నోమి = ఎఱుకపడిన మనోభావము యొక్క నిగ్గుకలిగినట్టి యాపురుషునివంక విభ్రమముతోఁగూడిన చూపును నిగుడ్చుటకు సయితము సిగ్గుచేత సమర్థురాలను గాను, హి ఏషః లోకః పర ఉపహాస చతురః అలం సూక్ష్మ ఇఙ్గిత జ్ఞః అపి = ఏలయనఁగా ఈ జనము ఇతరులను హేళనము చేయుటయందు నేర్పరి (యు) మిక్కిలి అస్ఫుట మయిన భావచిహ్నములను ఎఱింగినదియును, మాతః కం శరణం వ్రజామి = అమ్మా ఎవ్వనిని రక్షకునిఁగా పొందుదును, అనురాగ అనలః హృదయే జీర్ణః = మరులనెడు నిప్పు మనస్సులో (నే) అణఁగారినది.

తా.---చెలులు వంచకురాండ్రయిరి కావున వారిద్వారా తెలుప వలను లేదు, అతనికి నాయందు ప్రీతి గలదని నా కెఱుక యయినను నా యనురక్తిని అతనికి తెలుప నీయక లజ్జ యడ్డపడుచున్నది, దానిని దాఁటి తెలుపుదునా యనిన, ఈలోకులు కడు గడుసు వాండ్రు ఎంతసూక్ష్మ చిహ్నముచేత నయినను నాభావమును కనిపట్టుదురు, అమ్మా, యీ కష్టము నుండి నన్ను కడతేర్చువా రెవ్వరును లేరు. కాన నావలపు నాహృదయ మును నిప్పువలె కాల్చికాల్చి అటనే అడఁగారు చున్నది.—నీ వయినను దూతివై రక్షింపుమని భా.

అవ॥ స్వాభిలాషం ప్రియాయ నివేదయితు మసమర్థా విషణ్ణా నాయికా ధాత్రీ మాహ - ఆస్తా మితి ॥ సఖీషు వయస్యాసు - విశ్వసనం విశ్వాస - ఆస్తాం తిష్ఠతు - విశ్వాసో నా స్తీ త్యర్థః - విదితాభిప్రాయ సారే - అభిప్రాయ ఆశయః - తస్య - సారః త త్త్వం - విదితో జ్ఞాతః - అభిప్రాయసారో యేన సః తథో క్తః తస్మి న్ పరేఙ్గితజ్ఞ ఇ త్యర్థః - తత్ర తస్మి న్ జనే - స్వప్రేమాలమ్బన భూతపురుష ఇ త్యర్థః - సలలితాం సవిలాసాం - భావగర్భితా మి త్యర్థః - దృశం దృష్టి - మపర్ణయితుం ప్రయోక్తు - మపి - వ్రీడయా లజ్జయా - న శక్నోమి న సమర్థాఽస్మి - హి యస్మా త్కారణా - దేష - లోకో జనః - పరోపహాసచతురః - పరేషా ముపహాసః తస్మి న్ - చతురో నిపుణోఽపి కించ - అల మత్యర్థం - సూక్ష్మేఙ్గితజ్ఞోఽపి - నిగూఢాభిప్రాయవేదీ చ - తస్మా ద్వ్రీడయా న శక్నో మీ త్యనుసంధేయం - హే మాతః హే అమ్బ - కం జనం - శరణం రక్షకం - వ్రజామి గచ్ఛామి. శరణం నా స్తీత్యర్థః - తస్మా దనురాగా నలః ప్రణయాగ్నిః - హృదయే మనసి - జీర్ణ శ్శాన్తః - ఇతి సంబన్ధః. అత్ర అనురాగ స్యానలత్వనిరూపణం సంతాపకారిత్వాత్. అత్ర పరకీయా నాయికా. కస్మి న్నపి జనే అనురాగం విధాయ తం సావరణసంధి దృష్టి సంధిభ్యా మావర్జయితు మక్షమా భూత్వా కం శరణం వ్రజా మ్యేనే

రాగానలో జీర్ణ ఇతి ధాత్ర్యాః పురః స్వావస్థాప్రకటనేన త్వమేవ శర
ణం నాన్య దితి స్వాభిప్రాయం సూచితవతీ త్యభిప్రాయః. దూతీముఖేన
సావరణసంధిః, స్వయ మేవ దృష్ట్వా సంధానం దృష్టిసంధిః. 'ఆస్తాం విశ్వ
సనం సఖీ ష్వి' త్యత్ర ప్రియం ప్రతి ప్రేషితా స్సఖ్యః స్వయ మేవ రతిం
కృతవత్యః, అతో విశ్వాసాభావాత్ సావరణసంధే ర్వ్యర్థతా దర్శితా;
'వ్రీడయా ప్రియె దర్శన మర్పయితుం న శక్నోమి' త్యత్ర దృష్టిసంధే ర
ప్యసంభవో దర్శితః. అత్ర విషాదో నామ సంచారీ భావః. యథోక్తం -

'కార్యావిస్తరణా ద్దైవా దాగత్యా ద్రాజదోషతః
కార్యాగ్రహో ద్విషాద స్స్యా. న్మనస స్సత్త్వహీనతా
వై మనస్య మనుత్సాహః సృక్వణోః పరిలేహనమ్
అపాయా న్వేషణం మూర్ఛా సంతతం ముఖశోషణమ్
శయనం ధ్యాన మిత్యాది రనుభావో భవే దిహ.'

సంజ్వరో నామ నవమీ దశా - యథోక్తమ్ -

'చక్షుః ప్రీతి ర్మన స్సఙ్గః సంకల్పోఽథ ప్రలాపితా
జాగరః కార్శ్య మరతి ర్లజ్జాత్యాగోఽథ సంజ్వరః
ఉన్మాదో మూర్ఛనం చైవ చరమం మరణం విదుః.' ఇతి.

అయోగ విప్రలమ్భ శృఙ్గారః. ఆక్షేపశ్లేషరూపం శృఙ్గారి నర్మ. జాతి
రలంకారః. ౫౪

---

శ్రుత్వా నామాఽపి యస్య స్ఫుటఘనపులకం
జాయతే యత్సమన్తా,
ద్దృష్ట్వా య స్యాననేన్దుం భవతి వపు రిదం
చన్ద్రకాన్తానుసారి,
తస్మి న్నాగత్య కణ్ఠగ్రహనికటపద
స్థాయిని ప్రాణనాథే

భగ్నా మానస్య చిన్తా భవతి మమ పున
ర్వజ్రమయ్యాః కథఞ్చిత్.        ౫౮

ఈసు దాల్పు మని బోధించిన చెలులతో అట్లు చేయలేనిదై నాయిక చెప్పుకొనుట.—యస్య నామ శ్రుత్వా అపి ఇదం వపుః యత్ సమన్తాత్ స్ఫుట ఘన పులకం జాయతే=ఎవని పేరును విన్న మాత్రాననే ఈ మేను ఏ కారణమువలన అంతటను స్పష్టమును దట్టమును (అయిన) పులకలుగలది అగునో, యస్య ఆనన ఇన్దుం దృష్ట్వా చన్ద్ర కాన్త అనుసారి భవతి=ఎవని ముఖ చంద్రుని కని (ఈ మేను) నెల ఱాతిని బోలునది అగునో (చంద్రుని యెదుట చంద్రకాంతము స్రవించినట్లు అతని మోముం గన్నంత నాయొడలెల్ల చెమరుతో నిండు నని యర్థము), తస్మిన్ ప్రాణనాథే ఆగత్య కణ్ఠ గ్రహ నికట పద స్థాయిని (సతి) = ఆ ప్రాణేశ్వరుఁడు వచ్చి కంఠగ్రహం గవుంగిలించుటకు (తగిన) సమీప స్థానమందు నిలిచినవాఁడు కాఁగా, కథఞ్చిత్ వజ్రమయ్యాః మమ పునః మానస్య చిన్తా భగ్నా భవతి=ఎట్లో కఠినాత్మురాలనయిన నాకు మఱి ఈసు (దాల్చు) తలంపు చెడినది అగును (ఆ తలంపు పోవు నను‌ట.)

తా.—అతని పేరు విన్నమాత్రాననే నాయొడలెల్ల స్పష్టముగాను దట్టముగాను పులకరించును, అతని నెమ్మోముం గన్నంత నాయొడలెల్ల చెమరుదాల్చును. అట్టి మత్ప్రేమాస్పదుఁడాతఁడు చెంతకు రాఁగానే నాకు ఆలింగనబుద్ధియే గలుగును గాని మీరు బోధించునట్టి పొలయలుక తలంపునకే రాదు.

అవ॥ సఖీభి ర్మానకరణాయ బోధితా నాయికా స్వస్యా అసామర్థ్యం తాభ్యో నివేదయతి-శ్రు త్వేతి॥ యస్య ప్రియస్య - నామ నామధేయ - మపి - శ్రుత్వా నిశమ్య - వపు - ర్య ద్యస్మా త్కారణా - త్సమన్తా త్సమన్తతః - స్ఫుటఘనపులకం వ్యక్తసాన్ద్రరోమాఞ్చం - జాయతె భవతి - కిం చ య - స్యానన్దేన్దుం ముఖచన్ద్రం - దృష్ట్వా అవలోక్య -

ఇదం వపు రేత చ్ఛరీరం - చన్ద్రికాన్తానుసారి - చన్ద్రికాన్త మనుసర
తీతి చన్ద్రికాన్తానుసారి తద్వ త్స్విన్నం భవతీ త్యర్థః - తస్మి - న్ప్రాణ
నాథే ప్రాణేశ్వరే - ఆగత్య ఏత్య - కణ్ఠగ్రహ నికటపదస్థాయిని సతి -
కణ్ఠస్య గళస్య - గ్రహో గ్రహణం - ఆలిఙ్గన మి త్యర్థః - తస్య - నికట
పదం సమీపస్థానం - తత్ర - తిష్ఠ తీతిస్థాయీ - తస్మి - న్కథ ఇచ్ఛ త్యే
నాఽపి ప్రకారేణ-వజ్రమయ్యాః కులిశ సదృశ్యాః-ఆరోపితకాఠిన్యాయా
ఇత్యర్థః - మమ పున - ర్మానస్య కోపస్య - చిన్తాకృతిః- భగ్నానిహతా-
మానః కథం క్రియతే - పునశ్శబ్దో వాక్యాలఙ్కారే. అత్ర నాయికా
ప్రగల్భా. అపరాధీ ప్రియః తస్మి న్మానః కర్తవ్య’ ఇతి సఖీభి ర్బోధితా
ప్రోత్సాహితా సతీ ఆత్మనోఽసామర్థ్యం కథయతీ త్యభిప్రాయః. అత్ర
నాయికా స్వీయా మధ్యా చ. నాయక శ్శఠః. ఆత్మోపక్షేపరూపం
శృఙ్గారి నర్మ. జాతి రలఙ్కారః. ౫౮

---

సాన్త్యేవాత్ర గృహే గృహే యువతయ;
స్తాః పృచ్ఛ గత్వాధునా;
ప్రేయాంసః ప్రణమన్తి కిం తవ పున
ర్దాసో యథా వర్తతే?
ఆత్మద్రోహిణి, దుర్జనప్రలపితం
కర్ణే భృశం మాకృథా,
శ్ఛిన్నస్నేహరసా భవన్తి పురుషా
దుఃఖానువృత్త్యా యతః. గీ॰

మోడి వహించిన నాయికను నాయకపక్షమున సఖి బోధించుట.—
అత్ర గృహే గృహే యువతయః సన్తి ఏవ= ఈనగరంబున ఇంటింటను
జవ్వనులు ఉండనే యున్నారు, అధునా గత్వా తాః పృచ్ఛ = ఇప్పుడు

పోయి వారిని అడుగుము, తవ దాసః పునః యథా వర్తతే (తథా) ప్రే యాంసః ప్రణమన్తి కిమ్ = నీయొక్క దాసుఁడు (దాసుఁడుం బోలె నిన్ను కొలుచుచున్న యీ నీభర్త) ఎట్లు నడచుకొనుచున్నాఁడో (అట్లు) ప్రియ తములు (ప్రియులను) నమస్కరింతు రేమో (పోయి అడుగుము అనుట), (హే) ఆత్మద్రోహిణి=(ఓసి) తన్నే (నిన్నే) చెఱుచుకొనుదానా, దుర్జన ప్రలపితం కర్ణే భృశం మా (అ) కృథాః=దుష్టులయొక్క ప్రల్లదమును చెవిని బొత్తిగా పెట్టకుము, యతః=ఏల యనఁగా, దుఃఖ అనువృత్త్యా పురుషాః ఛిన్న స్నేహ రసాః భవన్తి=దుఃఖమునకు తెంపులేమిచేత మగ వారు నష్టమయిన యనురాగ గుణముగలవారు అగుదురు (ప్రేమను వద లుదు రనుట.)

నీవల్లభునికి నీయందుఁ గలకూరిమి ఏవల్లభునికిని ఎవ్వతెయందును లేదు. నీవు దుష్టులకొండెములు విని మోడి వహించి చెడిపోవుచున్నావు. వారిమాటలు వినకు. ఇట్టే దుఃఖ పెట్టుచుందు వేని నీకాంతుని కూరిమి నాసిల్లును జుమా— అనుట.

అవ॥ అత్యన్తకుపితాం నాయికాం ముహుర్ముహు రనునీయ విఫలి తేన నాయకేన ఖేదం ప్రాపితా సఖీ తా ముపాలభతే - సన్తీతి॥ అత్ర నగరే - గృహేగృహే ప్రతిగృహం - యువతయః తరుణ్యః - సన్తి విద్యన్త ఏవ - అధునా ఇదానీం - గత్వా తాః పృచ్ఛ ప్రియోపచారప్రకార మితి శేషః - ప్రేయాంసః ప్రియతమాః - ప్రణమన్తి కిం ప్రేయసీ రితి శేషః - తవ పునః-ప్రేయాన్ ప్రియతమ-స్తు దాసో యథా ప్రేష్య ఇవ - వర్తతే చరతి - హే ఆత్మద్రోహిణి - తస్యాః సంబుద్ధిః - దుర్జన ప్రలపితం పిశున జల్పితం - కర్ణే శ్రవణే - భృశం దృఢం - మా కృథాః న కురుష్వ- యతః యస్మా త్కారణాత్ - పురుషాః - దుఃఖానువృత్త్యా ఖేదానుబన్ధేన- అనునయవైయర్థ్యజనిత ఖేదానుబన్ధే నేత్యర్థః-ఛిన్న స్నేహరసాః గళిత ప్రేమగుణా - భవన్తి త్యనేన ప్రియస్య ప్రేమవిచ్ఛేదే సతి భవత్యాః ప్రాణ

పర్యన్తోఽనర్థో౽ భవిష్య తీతి సూచితః. అత్ర నాయికా స్వీయా మధ్యా చ. నాయక శ్శఠః. ఈర్ష్యా౽మానకృతో విప్రలమ్భ శృఙ్గారః. అత్ర సోపాలమ్భవచనరూపం నర్మ. ఆక్షేపోఽలంకారః. ౫౯

---

స్మరరసనదీపూరే ణోఢాః పున ర్గురుసేతుభి
ర్య దపి విధృతా స్తిష్ఠ న్త్యారా దపూర్ణమనోరథాః,
త దపి లిఖితప్రఖ్యై రఙ్గైః పరస్పర మున్ముఖాః
నయననళినీనాళానీతం పిబ న్తి రసం ప్రియాః. ౬౦

ప్రియాః = ప్రియాలును ప్రియులును, స్మర రస నదీ పూరేణ ఊఢాః = మన్మథకృతమయిన యనురాగమనెడి యేటిజాలుచేత వహింపఁబడినవారు, పునః గురు సేతుభిః విధృతాః = అయినను పెద్దలనెడు అనకట్టలచేత ఆఁపఁబడినవారై, ఆరాత్ అపూర్ణ మనోరథాః తిష్ఠన్తి = (ఒండొరుల) చెంతను కోరికలు తీఱనివారై ఉన్నారు, తత్ అపి లిఖిత ప్రఖ్యైః అఙ్గైః పరస్పరమ్ ఉన్ముఖాః = అట్లయినను చిత్తరువులతో సరియయినను యవయవములతో (కూడుకొన్నవారై), ఒండొరులవైపు మోము త్తినవారై, నయన నళినీ నాళ ఆనీతం రసం పిబన్తి = కన్నులనెడి తామర తూండ్లచేత తేఁబడిన ఆహ్లాదజలమును త్రాగుచున్నారు.

తా.—వయసుదంపతులు ఒకరిచెంతనే ఒకరు ఉండియు ఆలింగనాదిమనోరథ పరంపరావశంవదు లయ్యును గురుసన్నిధిచేత ఆమనోరథములం దీర్చుకొనక అవయవచేష్టలచేత నేని యొకరొకరికి అభిప్రాయములం దెలుపుకొనక ఒండొరులం జూచుచూపులచేతనే పరమానందంబుం బొందుదురు.

అవ॥ కవే ర్వాక్యమ్ - స్మరేతి॥ ప్రియాః-"పుమాన్ స్త్రియా" ఇత్యేకశేషః-ప్రియా శ్చ ప్రియతమా శ్చే త్యర్థః-స్మరరసనదీ పూరేణ-

స్మరేణ కామేన - కృతో - రసో రాగ-స్స ఏవ నదీపూరః తేన - ఊఢాః ఉద్ధృతాః-బలాన్నీతా ఇత్యర్థః-పున ర్భూయః-గురుసేతుభిః-గురవో గురుజనా-ఏవ-సేతవః ప్రవాహబన్ధాః-తై-ర్య ద్యస్మా త్కారణాత్ - విధృతా అపి నివారి తా శ్చ-భవన్తః-ఆరా త్సమీపే-అపూర్ణ మనోరథాః అపర్యాప్త కామా- స్తిష్ఠన్తి ఆసతే-తదపి తథాపి-లిఖిత ప్రఖ్యై శ్చిత్రసదృశై-రఙ్గై శ్శరీరై-రుపలక్షితాః - పరస్పర మన్యోన్య-మున్ముఖా అభిముఖా-స్సన్తః-నయన నళినీ నాళానీతం - నయనాని లోచనా- న్యేవ-నళినీనాళాని పద్మకాణ్డాని-తై-రానీత మాహృత-రస మహ్లాదం - పిబన్తి ఆస్వాదయన్తీతి సంబన్ధః. అత్ర 'స్మరరసనదీపూరే ణోఢా' ఇత్యనేన అత్యన్త మభిలాష పంత్రా ఇతి గమ్యతే. 'లిఖిత ప్రఖ్యై రఙ్గై' రిత్యనేన స్తమ్భం నామ సాత్త్వికభావం గతా ఇత్యేవం గమ్యతే. ఔత్సుక్యం నామ సంచారీ భావః. సంభోగశృఙ్గారః-యథోక్తం దశరూపకే -

'అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ
దర్శనస్పర్శనాదీని స సంభోగ ఉదాహృతః.' ఇతి.

అత్ర చేష్టాకృతం స్వగ్గేచ్ఛారూపం శృఙ్గారి నర్మ. జాతిరలంకారః. ౬౦

---

నిశ్శేషచ్యుతచన్దనం స్తనతటం,
నిర్మృష్టరాగోఽధరో,
నేత్రే దూర మనఞ్జనే, పులకితా
తన్వీ త వేయం తనుః,
మిథ్యావాదిని, దూతి, బాన్ధవజన
స్యాజ్ఞాతపీడాగమే,
వాపీం స్నాతు మితో గతాసి న పున
స్తస్యాధమ స్యాన్తికమ్. ౬౧

నాయికపంపున నాయకునికడకుం బోయినదూతి అతనితో సంగ
మించి రాఁగా చిహ్నములచే అవృత్తాంతముం గనిపట్టి నాయిక దూతిని
వక్రోక్తిచే నిందించుట.—దూతి (తవ) స్తనతటం నిశ్శేష చ్యుత చన్దనమ్=
దూతి నీయొక్క చనుగట్టు బొత్తిగా జాఱిన గంధముగలది (అయినది),
అధరః నిర్మృష్ట రాగః = పెదవి తుడిచివైవఁబడిన యెఱుపుగలది, నేత్రే
దూరమ్ అనఞ్జనే-కన్నులు బొత్తిగా కాటుకలేనివి, ఇయం తన్వీ తనుః పుల
కితా=ఈ సన్నని మేను గగురుపాటుకలది, మిథ్యావాదిని=(ఓసి) కల్లలు
పలుకుదానా, బాన్ధవ జనస్య అజ్ఞాత పీడా ఆగమె=ఇష్టురాలియొక్క (నా
యొక్క) ఎఱుఁగఁబడని బాధయొక్క రాక గలదానా, ఇతః వాపీం స్నా
తుం గతా అసి=ఇటనుండి బావికి స్నానమాడుటకై పోయినదానవు అయి
తివి, తస్య అధమస్య అన్తికం పునః న (గతా అసి)-ఆ యధముని చెంతకు
అయిననో పోయినదానవు కావు.

ఓదూతీ, నీవు నాయకునికడకే పోయి వచ్చితి నని కల్లలు పలుకు
చున్నావు, ఇదె నీ చనుగట్టులమీఁదిగంధంపుఁబూఁత సర్వమును పోయినది,
పెదవియందలి యెఱుపు (తాంబూలముదో లత్తుకద్రవముదో) సర్వము
కడిగివైచినట్లు పోయినది, కన్నులయందలికాటుక బొత్తిగా పోయినది,
ఒడలెల్ల గగుర్కొనియున్నది. నీవు నాకై నానాయకునికడకుం బోవునట్లు
మిష పెట్టి, నీయిష్టురాలనయిన నాకుం గలిగిన బాధ నెఱుంగక, జలక
మాడ బావికి పోయితివి గాని ఆనీచునికడకు పోవైతివి.—అని యర్థము.

నీవు నాకై పోయినట్లు పోయి వానితో సంగమించి వచ్చితివి;
అందులకు ఈ చందనరాగౌష్ఠాంజననాశము పులకలును నిదర్శనము. ఏవమాది
కము భా. ఈవిపరీత భావ మెల్ల 'అధమస్య' అను పదముచే వెలఁవడు
చున్నది. నాయికను మాని దూతిని స్వీకరించినందున అధముఁడు.

అవ॥ నాయక మానేతుం గతాం లక్ష్యమాణసంభోగచిహ్నాం
దూతీం నాయికా ప్రాహ - నిశ్శేషేతి ॥ స్తనతటం కుచతటం - నిశ్శేష

చ్యుత చన్దనం నిశ్శేషం యథా భవతి తథా - చ్యుతం గళితం - చందనం యస్మా త్తత్తథోక్తమ్ - అధరో దశనచ్ఛదః నిర్మృష్టరాగః అపగతాలక్తకః- అపగతతామ్బూలరాగో వా - నేత్రే దూర మత్యర్థం - అనఞ్జనే కజ్జలరహితే - తన్వీ తవ ఇయం తనుః - పులకితా సరోమాఞ్చా - మిథ్యావాదిని అసత్ప్రలాపిని - బాన్ధవ జనస్య సుహృజ్జనస్య - అజ్ఞాతపీడాగమే- అజ్ఞాతః అనవగతః - పీడాగమో దుఃఖప్రాప్తి - ర్యయా సా తథోక్తా - తస్యా స్సం బుద్ధిః-అజ్ఞాతబాన్ధవజన పీడాగమే - ఇత్యర్థః- హే-దూతి సందేశహారిణి - ఇతః అస్మాత్ప్రదేశాత్ - వాపీం దీర్ఘికాం - స్నాతుం జలావగాహనం కర్తుం - గతాసి - అధమస్య నికృష్టస్య తస్య నాయకస్య అన్తికం పునః సమీపం తు - న గతా సీతి సమ్బన్ధః. అత్ర వాపీస్నానకథన వ్యాజేన సంభోగచిహ్నకథనా చ్చ నాయకస్య అధమత్వకథనా చ్చ 'తద న్తిక మేవ రన్తుం గతా సీ' త్యయ మర్థోఽవగమ్యతే. అత్ర నాయికా స్వీయా, ప్రగల్భా చ. నాయక శ్శఠః. ఈర్ష్యాక్రోధప్రాయం వచః. సమాధి రలఙ్కారః - యథోక్తం కావ్యాదర్శే - 'యుగపన్నైకధర్మాణా మధ్యాస శ్చ యథామతః.' ఇతి. ౯౧

---

మ్లానం పాణ్డు కృశం విలాసవిధురం లమ్బాలకం చాలసం
భూయ స్తత్క్షణజాతకాన్తి మధురం ప్రాప్తే మయి ప్రోషితే
సాటోపం రతికేళిదత్తరభసం రమ్యం కి మ ప్యాదరా
త్పీతం య త్సుతనో మయా ముఖ మిదం తత్కేన విస్మార్యతే.

మ్లానం పాణ్డు కృశం విలాస విధురం లమ్బ అలకమ్ అలసం చ = వాడినది(యు) పాలినది (యు) చిక్కినది (యు) కులుకులు లేనిది (యు) జాఱిన ముంగురులుగలది (యు) జడమును, ప్రోషితే మయి ప్రాప్తే(సతి)= దేశాంతరమేఁగిన నేను రాఁగా, భూయః తత్ క్షణ జాత కాన్తి మధురమ్

వెండియు అక్షణమందే (అనఁగా నేను వచ్చినక్షణమందే)ఉదయించిన శోభ చేత మనోహరమును, స (హ) ఆటోపం రతి కేళి ద త్త రభసం కిమ్ అపి రమ్యం సుతనోః ముఖమ్=గర్వముతో కూడుకొన్నది (యు) సంభోగలీలచే ఈయఁబడిన వేగముకలది (యు) ఏమియో (అనిర్వచనీయముగా) రమణీయ మును (అయిన) (యా) శోభనాంగియొక్క మొగము, మయా ఆదరాత్ పీతమ్ (ఇతి) యత్=నాచేత తమకముతో ముద్దుపెట్టుకొనఁబడియె (ననుట) యేదో, తత్ కేన విస్తార్యతే=అది దేనిచేత మఱపింపఁబడును.

నేను తన్నుఁ బాసి దేశాంతరముపోయి యున్నప్పుడు విరహదుః ఖార్తయై, నేను రాఁగా నే హర్షపరవశయై నన్నుం గవసిన ప్రేయసివదన మును నేను చుంబించినయానందమును ఎవ్విధముననూ మఱవఁజాల ననుట.

నాయకోక్తిః - మ్లాన మితి ॥ పూర్వం - మ్లానం తాన్తం - పాణ్డు ధూసరం- కృశం క్షామం-విలాసవిధురం విభ్రమశూన్యం లమ్బాలకం స్రస్త కున్తలం - అలసం జడం - చ తతః - ప్రోషితే దేశాన్తరం గతే - మయి- ప్రాప్తే సమాగతే-సతి భూయ స్తత్క్షణ జాత కాన్తి మధురం(చతురం వా) తత్కాల సంభూత శోభా సుభగం - తత - స్సాటోపం సగర్వం - రతి కేళిద త్తరభసం సురతక్రీడావిహితసంభ్రమం - కి మపి రమ్యమ్ అనిర్వాచ్య సౌన్దర్యం - సుతనో స్తన్వ్యాః - ముఖం మయా - ఆదరా దాస్థాతిశయా- త్పీతం ఆస్వాదిత - మితి యత్ త దిదం - కేన కర్మణా - విస్మార్యతే తిరోధీయత - ఇతి సంబన్ధః. నాయికా స్వీయా మధ్యా చ. నాయకోఽను కూలః. సంభోగశృఙ్గారః. జాతి రలంకారః. ౬౨

---

ఆయస్తా కలహం పు రేవ కురుతేన స్రంసనే వాససో,
భుగ్నభ్రూ రతిఖణ్డ్యమానమధరం ధత్తేవ కేశగ్రహే,
అఙ్గా న్యర్పయతి స్వయం భవతి నో వామా హఠాలిఙ్గనే,
తన్వ్యా శిక్షిత ఏష సంప్రతి పునః కోపప్రకారోఽపరః ౬౩

నాయికా కోపప్రకారవిశేషము.—ఆయస్తా (సతీ)= (ఈసుచే) నొగిలినదై, పురా ఇవ వాససః స్రంసనే కలహం న కురుతే=మునుపటి వలె వలువను వీడలాగుటయందు (లాగునందులకు) జగడము చేయకున్నది (ఇంతకు ముందు నాపై కోపము వచ్చినప్పుడు తన వలువను నేను విప్పఁ జొచ్చినచో విప్పనీయక కలహించుచుండినది, ఇప్పుడు వచ్చిన కోపములో అట్లు చేయకున్నది అనుట; ఇట్లే అనంతరవాక్యములందును గ్రహింపవలయును), కేశగ్రహే భుగ్నభ్రూః అతి ఖణ్డ్యమానమ్ అధరం న ధత్తే= (నేను తన) కొప్పును పట్టుకొన్నప్పుడు ముడివడిన బొమలుకలదై మిక్కిలి కొఱుకఁబడుచున్న పెదవిని ధరింపకున్నది (కనుబొమలు ముడువక పెదవిని కొఱుకుకొనక యున్నది), హఠ ఆలిఙ్గనే వామా నో భవతి అఙ్గాని స్వయమ్ అర్పయతి=బలాత్కారమున (నేను) కౌఁగిలించినంతట వక్రురాలు కాకున్నది అవయవములను (నాకు) తానే అప్పగించుచున్నది, సంప్రతి పునః తన్వ్యా ఏష అపరః కోప ప్రకారః శిక్షితః=ఇప్పుడు మఱి ప్రియచేత ఇది (ఏదో) వేఱు అలుకతీరు నేర్వఁబడినది.

ప్రేయసి ఇప్పుడు ఈయలుకలో మునుపటివలెఁ గాక వేఱువిధముగా వ్యవహరించుచున్నది, అలుకను దాఁచుచున్నది, అని భా.

ఆయస్తా ఆయాసం ప్రాప్తా - ఈర్ష్యాతిశయే నేతి శేషః-పురేవ పూర్వ మివ - వాససః వస్త్రస్య - స్రంసనే మోచనే-కలహం-న కురుతే న విధత్తే-కిం చ-కేశగ్రహే కేశాకర్షణే-పురేవ- భుగ్నభ్రూః భ్రూభఙ్గవతీ సతీ - అతిఖణ్డ్యమానం అత్యన్తం దశ్యమానం - అధరం దన్తచ్ఛదం - న ధత్తేన వహతి - కిం చ - హఠాలిఙ్గనే - పురేవ వామా వక్రా - నో భవతి న భవతి - కిన్తు - అఙ్గాని గాత్రాణి - స్వయ మాత్మనా - అర్పయతి ప్రయచ్ఛతి - సంప్రతి పునః ఇదానీం - తన్వ్యా కాన్తయా - ఏషో ऽయ మపరో ऽన్యః - కోపప్రకారో రోషభఙ్గీ - శిక్షితో ऽభ్యస్త - ఇతి సంబన్ధః. అవహిత్థం నామ సంచారీ భావః. నాయికా స్వీయా ధీరా

ప్రగల్భా చ. నాయక శ్శఠః. ఈర్ష్యామానకృతో విప్రలమ్భః శృఙ్గారః. అత్ర సమర్గభః, యుక్త రలంకారః. ౬౩

---

చిన్తామోహానిబధ్యమానమనసా మానేన పాదానతగ
ప్రత్యాఖ్యాతపరాఙ్ముఖః ప్రియతమో గన్తుం ప్రవృత్త శ్శఠః
సవ్రీడై రలసై ర్నిర న్తరలుఠ ద్బాష్పాకులై రీక్షణై
స్తన్వఙ్గ్యా స పున స్తయా తరళయా తత్రా న్తరే వారితః.

శఠః ప్రియతమః = ధూర్తుఁడగు వల్లభుఁడు, పాద ఆనతః (సన్) అడుగులకు మ్రొక్కినవాఁడయ్యును, చిన్తా మోహా నిబధ్యమాన మనసా తయా తన్వఙ్గ్యా విచారముచేతనయిన పరాకుచేత అరికట్టఁబడిన మనస్సుగల దైన యా సుందరిచేతను, మానేన ప్రత్యాఖ్యాత పరాఙ్ముఖః (సన్)=మాటలాడమిచేత నిరాకరింపఁబడి వెనుకకు మఱలినవాఁడై, గన్తుం ప్రవృత్తః= పోవుటకు కడంగెను; పునః తత్ర అన్తరే= కాని అంత లోపల, తరళయా తయా=చపలురాలైన యానాయికచేత, స (హ) వ్రీడైః అలసైః నిరన్తర లుఠత్ బాష్ప ఆకులైః ఈక్షణైః=సిగ్గుతో కూడుకొన్నవియు మెల్ల మెల్లనివియు ఎడతెంపులేక దొరలుచున్న కన్నీళ్ల చే కలఁగినవియు (నైన) చూపులచే, సః వారితః=అతఁడు (పోకుండ) ఆఁపఁబడెను.

నాయకుఁడు పాదములకు మ్రొక్కినసమయమందు నాయిక చింత వలనిపరాకుచేత అతనితో పలుకకయుండఁగా అతఁడు తన్ను తిరస్కరించిన దని తలంచి లేచి పోఁగడంగెను; అప్పుడు ఆమె తనపొరఁబాటు నకై సిగ్గుపడి యాతనిం బాష్పపూర్ణలోచనయై చూడఁగా అతఁడు పోక నిలిచెను.—అనుట.

కవే ర్వాక్యమ్ - చిన్తేతి ॥ శఠః ప్రియతమః - పాదానత స్సన్ - చిన్తా మోహానిబధ్యమానమనసా - చిన్తయా విచారేణ కృతో - మోహో జాడ్యం - తేన నిబధ్య మానం నిగృహ్యమాణం - మనోయస్యా స్సా -

తథోక్తా తయా తన్వఙ్గ్యా - మానేన అభాషణేన - హేతునా ప్రత్యా
ఖ్యాతః నిరస్తః 'ప్రత్యాఖ్యాతో నిరాకృత' ఇత్యమరః - స చాసౌ - పరా
ఙ్ముఖో విముఖశ్చ - భూత్వా - గన్తుం నిర్గన్తుం - ప్రవృత్తః ఉద్యుక్తః -
తత్రాన్తరే తస్మిన్నవసరే - తరళయా అధీరయా - తయా చ - సవ్రీడైః
సలజ్జై - రలసై మన్దసఞ్చారైః - నిరన్తరగళద్బాష్పకలుషై స్సన్తత పరి
వర్తమానాశ్రుకలుషైః - ఈక్షణై ర్విలోకనైః - హేతుభిః స పునః
సన్నివారిత ఇతి సంబన్ధః. అత్ర దైన్యం నామ సంచారీభావః నాయికా
స్వీయా మధ్యా చ. నాయక శ్శఠః. విప్రలంభశృఙ్గారః. సమాస్ఫోట.
ఆక్షేపాలంకారః. ౬౪



క్వచిత్తామ్బూలాక్తః, క్వచి దగరుపఙ్కాఙ్కమలినః,
క్వచి చ్చూర్ణోద్గారీ, క్వచి దపి చ సాలక్తకపదః,
వలీభఙ్గాభోగై రలకపతితైః శీర్ణకుసుమైః
స్త్రియా నానావస్థం ప్రథయతి రతం ప్రచ్ఛదపటః. ౬౫

క్వచిత్ తామ్బూల ఆక్తః=ఒక్కెడ తమ్ముల (ంపురస) ముచే డాగు
చేయఁబడినదియు, క్వచిత్ అగరు పఙ్క అఙ్క మలినః=ఒక్కెడ అగరు
గంధముయొక్క ద్రవముయొక్క గుర్తుచే డాగయినదియు, క్వచిత్ చూర్ణ
ఉద్గారీ=ఒక్కెడ (కప్పురములోనగు వాని) పొడుముయొక్క రాలుటకల
దియు, అపి చ క్వచిత్ స (హ) అలక్తక పదః=మఱియు నొకచోట లత్తు
కతోఁ గూడిన యడుగు(గుర్తు)లు కలదియు, వలి భఙ్గ ఆభోగైః= ముడుత
లనెడి యలలయొక్క విరువులతోను, అలక పతితైః శీర్ణ కుసుమైః=ముంగు
రులనుండి రాలిన చెదరిన పువ్వులతోను, (కూడుకొన్నదియు) (నయిన),
ప్రచ్ఛద పటః=పరుపును గప్పు దుప్పటి, స్త్రియాః నానా అవస్థం రతం ప్రథ
యతి=స్త్రీయొక్క పెక్కుబంధముల సంభోగమును వెల్లడిసేయుచున్నది.

పడకయందు నానాబంధములయొక్క గుర్తులుఅగపడుచున్న వనుట.

కవే ర్వాక్యమ్ - క్వచి దితి ॥ క్వచి దేకత్ర - తాంబూలాక్తః తాంబూలరసరఞ్జితః - క్వచి దేకత్ర - అగరుపఙ్కాఙ్కమలినః - అగరోః పఙ్కః తస్య - అఙ్కో లక్ష్మ - తేన - మలినో మలీమసః - క్వచి దేకత్ర-చూర్ణోద్గారీ - చూర్ణస్య కర్పూరాది క్షోదస్య - ఉద్గారః గిరణం - సోఽస్మి న్నస్తీతి చూర్ణోద్గారీ - 'అత ఇని ఠనౌ' ఇతి మత్వర్థే ఇన్ ప్రత్యయః - క్వచిత్ కుత్రాపి - చ - సాలక్తకపదః అలక్తకేన లాక్షయా సహితం సాలక్తకం - పదం పాదముద్రా - యస్మి న్న తథోక్తః - వళీభఙ్గాభోగై - ర్వళ్య ఏవ - భఙ్గా స్తరఙ్గాః తేషా - మాభోగా విస్తారాః - తైశ్చ - అలకపతితైః - అలకేభ్యః పతితాని - తై శ్శీర్ణకుసుమైః - శీర్ణాని వికీర్ణాని - చ తాని కుసుమాని చ తై శ్చోపలక్షితః-ప్రచ్ఛదపటః ఆస్తరణవస్త్రం - స్త్రియాః కాన్తాయాః - నానావస్థం బహు ప్రకారా న్తరావస్థం - రతం - సుగతం ప్రథయతి ప్రఖ్యాపయ - తీతి సంబన్ధః. అత్ర - 'క్వచిత్తాంబూలాక్తౌ' ఇత్యనేన మార్జాలకరణం సూచితం భవతి యథోక్తం రతిరహస్యే—

'ప్రసారితే పాణిపాదే శయ్యాస్పృశి ముఖోరసి
ఉన్నతాయాం స్త్రియః కట్యాం మార్జాలకరణం విదుః.' ఇతి.

'క్వచి దగరుపఙ్కాఙ్కమలిన' ఇత్యత్ర ఐభో నామ బన్ధవిశేష స్సూచ్యతే - యథోక్తం రతిరహస్యే-

'భూగత స్తనభుజాస్యమ స్తకా మున్నతస్ఫిచ మధోముఖీం స్త్రియమ్
క్రామతి స్వకరగృహ్య మేహ నే వల్లభే కరివ దైభ ముచ్యతే.' ఇతి;

'క్వచి చ్చూర్ణోద్గారీ' త్యనేన ధైనుకం నామకరణ ముచ్యతే-యథోక్తం రతిరహస్యే-

'న్య స్తహ స్తయుగళా నిజే పదే యోషి దేతి కటిరూఢవల్లభా
అగ్రతో యది శనై రధోముఖీ ధైనుకం వృషవ దున్నతే ప్రియో.' ఇతి;

'క్వచి దపి చ సాలక్తకపద' ఇత్యనేన పురుషాయిత మూచితం - తత్ స్పష్ట మేవ; 'వళీభఙ్గాభోగై రలకపతితై రి' త్యనేన చ రత్యుపమదాతిశయ స్సూచ్యతే. జాతి రలంకారః.

---

అహం తే నాహూతా కి మపి కథయామీతి విజనే,
సమీపే చాసీనా సరళహృదయత్వా దవహితా
తతః కర్ణోపాన్తే కి మపి వద తాఘ్రాయ వదనం
గృహీత్వా ధమ్మిల్లం మమ సఖి నిపీతోఽధరరసః. ౬౬

నాయిక తన్ను నాయకుఁడు టక్కుచేసి ముద్దుగొన్నవిధమును చెలితోఁ జెప్పికొనుట.—(హే) సఖి=(ఓ) చెలీ, అహం తేన విజనే కిమ్ అపి కథయామి ఇతి ఆహూతా=నేను వానిచే ఏకాంతమందు ఒకవిశేషము చెప్పెదను అని పిలువఁబడితిని, సమీపే ఆసీనా సరళ హృదయత్వాత్ అవహితా చ (అస్మి)=చెంతను కూర్చున్న దానను తిన్నని మనస్సు గలదాన నగుటవలన ఏకాగ్రచిత్తురాలను సయితము (అయితిని; ప్రయోగ వ్యత్యయము.—) తతః కర్ణ ఉపాన్తె కిమ్ అపి వద తా=అనంతరము (అతఁడు) చెవి చెంత ఏమో చెప్పుచున్నవాఁడై, మమ వదనమ్ ఆఘ్రాయ ధమ్మిల్లం గృహీత్వా అధర రసః నిపీతః=నా ముఖమును మూర్కొని కొప్పును పట్టుకొని మోవి మాధుర్యమును అనినవాఁడాయెను.

రహస్యము చెప్పెద నని ఏకాంతమునకు పిలిచి చెవిలో ఏమో పలుకుచు మొగము నాఘ్రాణించి తటాలున కొప్పుపట్టుకొని అధరరసము నానె నని సంక్షేపము. కొప్పు పట్టుకొనుట తప్పించుకో నీయకుండుటకును అధరమును సరిగా తననోటికడకు తెచ్చుకొనుటకును.

నాయకేన ప్రలోభితా నాయికా సఖీ మాహ - అహ మితి ॥ అహం తేన ధూర్తేన - విజనే - కి మపి కథయా మీతి కించి ద్వదా మీతి -

ఆహూతా ఆకారితా - సమీపే - ఆసీనా ఉపవిష్టా చ - సరళహృద యత్వా దకుటిలచిత్తత్వా - దనహితా ఏకాగ్రచిత్తా - అస్మి - తత స్తద నన్తరం కర్ణోపాన్తే శ్రవణసమీపే - కి మపి యత్కిఞ్చి - ద్వదతా కథ యతా- తేన వదనం ముఖమ్-ఆఘ్రాయ-ధమ్మిల్లం కేశబన్ధం-గృహీత్వా హే సఖి మమ అధరరసః - నిపీతః ఆస్వాదిత - ఇతి సంబన్ధః. నాయికా స్వీయా ముగ్ధా చ. నాయకోఽనుకూలః. నర్మగర్భః. యుక్తి రలంకారః.

---

పుష్పోద్భేద మవాప్య కేళిశయనా ద్దూరస్థయా చుమ్బనే
కాన్తేన స్ఫురితాధరేణ నిభృతం భ్రూసంజ్ఞయా యాచితే
ఆచ్ఛాద్యస్మిత పూర్ణగణ్డఫలకం చేలాఞ్చలే నాననం
మన్దాఽన్దోళితకుణ్డల స్తబకయా తన్వ్యా విధూతం శిరః ౬౭

(ప్రయోగవ్యత్యయము)—పుష్ప ఉద్భేదమ్ అవాప్య కేళి శయ నాత్ దూర స్థయా=తన్వ్యి రజస్సుయొక్క ప్రాదుర్భావమును పొంది (బహిష్ఠయై, సంభోగంపుఁ బానుపునుండి దూరమున నున్నదైన నాయిక, స్ఫురిత అధరేణ కాన్తేన నిభృతం భ్రూ సంజ్ఞ యా చుమ్బనే యాచితే (సతి) = కదలుచున్న మోవికలవాఁడైన కాంతుఁడు రహస్యముగా కను బొమల సంజ్ఞ చేత ముద్దుగొనుటను ప్రార్థించినవాఁడు కాఁగా, స్మిత పూర్ణ గణ్డ ఫలకమ్ ఆననం చేల అఞ్చలేన ఆచ్ఛాద్య = చిఱునవ్వుతో నిండిన ఫలకములవంటి (విశాలములయిన) చెక్కిళ్లతోడి మోమును వలువకొనతో కప్పి, మన్ద ఆన్దోళిత కుణ్డల స్తబకయా (సత్యా) శిరః విధూతమ్=మెల్లగా ఊఁపఁబడిన కుండలములనెడు పూగుత్తులుగలదై శిరస్సును అడ్డముగా కదలించినది.

శయనమునుండి బహిష్ఠయై లేచి పోయిన నాయికను ఆకారణ మెఱుఁగక నాయకుఁడుఁ బొమసంజ్ఞ చేతను అధర స్ఫురణ సంజ్ఞ చేతను చుంబనమును యాచింపఁగా నాయిక కుండల స్తబకమునకు చేర్పగా చేల

చెఱంగును పట్టుటచే పుష్పవతినై యున్నాననియు శిరమును అడ్డముగా ఆడించుటచేతను నీవు కోరినది యిప్పుడు కూడ దనియు సూచించినది.

కవే ర్వాక్యమ్ - పుష్పోద్భేద మితి॥ పుష్పోద్భేదం రజః ప్రాదుర్భావమ్ - అవాప్య - కేళిశయనా ద్దూరస్థయా క్రీడాతల్పం విహాయ విప్రకృష్టయా - ల్యబ్లోపే పఞ్చమీ - స్ఫురితాధరేణ స్పన్దితాధరేణ - కాన్తేన ప్రియేణ - భ్రూసంజ్ఞయా సాధనేన - నిభృతం గూఢం - చుమ్బనే - యాచితే ప్రార్థితే - సతి - స్మితపూర్ణ గణ్డఫలకం మన్దహాసభరిత కపోల తలమ్ - ఆననం - చేలాఞ్చలేన అంశుకపల్లవేన - ఆచ్ఛాద్య ః ధాయ - మన్దాన్దోళిత కుణ్డల స్తబకయా - మన్దం శనైః - ఆన్దోళితా - ఆలోళితా - కుణ్డలే కర్ణవేష్టనే - ఏవ - స్తబకౌ గుచ్ఛౌ - యస్యాస్సా తయా-తన్వఙ్గి కాన్తయా-శిరో-విధూతం తిర్యక్చలిత-మితి సంబన్ధః. 'శిరో విధూత మి' త్యనేన ప్రతిషేధ స్సూచితః. ఔత్సుక్యం నామ సంచారీ భావః. నాయికా స్వీయా, మధ్యాప్రగల్భయో రన్యతరా, స్వాధీనపతికా చ. నాయకోఽనుకూలః. సంభోగశృఙ్గారః. అత్ర చేష్టాకృతం సఙ్గేచ్ఛారూపం వస్తు. సూక్ష్మాలంకారః - యథోక్తం కావ్యాదర్శే -

'ఇఙ్గితాకార లక్ష్యోర్థ స్సౌక్ష్మ్యా త్సూక్ష్మ ఇతి స్మృతః' ఇతి. ౬౨

---

క్వ ప్రస్థితాసి కరభోరు, ఘనే నిశీథే?
ప్రాణేశ్వరో వసతి యత్ర మనఃప్రియో మే
ఏకాకినీ వద కథం న బిభేషి బాలే?
నన్వస్తి పుఙ్ఖితశరో మదన స్సహాయః. ౬౩

సఖీనాయికల ప్రశ్నోత్తరములు.— సఖి.—(హే) కరభ ఊరు ఘనే నిశీథే క్వ ప్రస్థితా అసి = (కరభ మనఁగా మనికట్టునుండి కనిష్ఠిక వఱకు చేతి వెలుపలివైపు) కరభమువంటి తొడలుగలదానా దట్టమైన(యీ) నడిరేయిచీఁకటియందు ఎటకు తరలినదాన వయితివి? నాయిక.— మే

మనః ప్రియః ప్రాణేశ్వరః యత్ర వసతి = నాకు మనస్సునకు ఇష్టుఁడయిన జీవితనాథుఁడు ఎట్లనున్నాఁడో (అటకు తరలితిని అని శేషము. సఖి.— (హే) బాలే ఏకాకినీ కథం న బిభేషి వద=(ఓసి) చిన్నదానా ఒంటరివి ఎట్లు భయపడకున్నావు చెప్పుము ? నాయిక.— పుఙ్ఖిత శరః మదనః సహాయః అస్తి ననుసంధింపఁబడిన బాణముగలవాఁడు మన్మథుఁడు తోడు కలఁడుగదా.

సఖి.—నడికిరేయి కటికి చీఁకటిలో ఎక్కడికిపోవుచున్నావే? నాయిక.—నా ప్రాణనాథునికడకు. సఖి.— ఒంటరిగా పోవుచున్నావే భయము లేదా? నాయిక.—భయ మెక్కడిది? విల్లెక్కువెట్టి బాణము తొడిగి మదనుఁడు తోడువచ్చుచున్నాఁడు .గదా.—అనుట. మదనుని బారికి తాళఁజాలక ఈయర్ధరాత్రంపుఁ గటికిచీఁకటిలో సాహసించి ప్రాణేశ్వరుని కడకు పోవుచున్నా నని నాయిక భావము.

పుంఖితశరుఁడు మదనుఁడు తోడు అనుటలో నాకు దారిలో ఎవఁడేమి యపాయము చేయవచ్చినను వాఁడు మదనబాణహతుఁడై నాకుదాసుఁడగును, కాన నాకేమియు నపాయము కలుగదు, అని స్వారస్యము.

సఖీ। నాయికా మాహ క్వేతి ॥ టీ - కరభోరు కరభా వివ ఊరూ యస్యా స్సా కరభోరూ - తస్యాస్సంబుద్ధిః ॥ సూ ॥ 'ఊరూ త్తర పదా దౌపమ్యే' ఇత్యూ ఙ్ప్రత్యయః ॥ ని ॥ 'మణిబన్ధా దాకనిష్ఠం కరస్య కరభో బహిః' త్యమరః - ఘనే నిబిడే - తమ సీతి శేషః - నిశీథే అర్ధరాత్రే- క్వ కుత్ర - ప్రస్థి తాసి ప్రయాతాసి - ఏవం సఖ్యా పృష్టా నాయికా ప్రత్యాహ - మే మనఃప్రియః మనసః హృదయస్య - ప్రియః అభీష్టః - ప్రాణేశ్వరః పాణనాథః - యత్ర యస్మిన్ ప్రదేశే - వసతి తిష్ఠతి - పౌనరుక్త్య మాస్థాతిశయేన - తత్సఖీ తా మాహ - హే - బాలే వత్సే- ఏకాకినీ అసహాయా-త్వం - కథం కేన ప్రకారేణ-న బిభేషి న త్రససి - వద బ్రూహి- తత స్సా సఖీ మాహ - పుఙ్ఖితశర స్సంహితబాణః - మదనః కామః -

సహాయ స్సహచరః-అస్తి నను విద్యతే ఖ-ల్వితి సంబన్ధః. వ్యక్త ఏ వాభి ప్రాయః. నాయికా పరకీయా, కిఞ్చ అభిసారికా, యథోక్తం భారతీయె-

'హిత్వా లజ్జాం సమాకృష్టా మద సేన మదేన చ
యాఽభిసారయతే కాన్తం సా భవే దభిసారికా' ఇతి.

అత్ర సహాస్యం శృఙ్గారి నమః. హేతు రలంకారః                    ౯౫

---

లోలభ్రూలతయా విపక్షదిగుప
న్యాసే విధూతం శిర,
స్తద్వృత్తా న్తవిదీక్షణే కృతమన
స్కారో విలక్ష స్థితః,
ఈష త్తామ్రకపోలకా న్తిని ముఖే
దృష్ట్యా నతః పాదయో,
రుత్సృష్టో గురుసన్నిధా వపి విధి
ర్ద్వాభ్యాం న కాలోచితః.                    ౯౬

లోల భ్రూ లతయా విపక్ష దిక్ ఉప న్యాసే (కృతే)=(నాయికచే) చంచలమయిన బొమ తీఁగతో వైరిదెసను తెలుపుట (చేయఁబడినప్పుడు) శిరః వి ధూతమ్=(నాయకునిచేత) తల అడ్డముగా ఆడింపఁబడినది, తత్ వృత్తా న్త విత్ ఈక్షణే (కృతే)=(నాయికచే) ఆ సమాచారము నెఱిఁగిన దానిని చూచుట (చేయఁబడఁగా), కృత నమస్కారః విలక్షః స్థితః = (నాయకుఁడు) చేయఁబడిన నమస్కృతి గలవాఁడై ఏమియుతోఁపనివాఁడై యుండెను, ముఖే ఈషత్ తామ్ర కపోల కా న్తిని (సతి) = (నాయిక యొక్క) మొగము ఇంచుక ఎఱ్ఱని చెక్కు్ళ్ళ శోభకలదికాఁగా, దృష్ట్యా పాదయోః నతః = (నాయకుఁడు) చూపుచేత అడుగులయందు వ్రాలిన వాఁడాయెను; ద్వాభ్యాంగురుసన్నిధా అపి కాల ఉచితః విధిః న ఉత్సృష్టః =

ఇద్దఱచేతను పెద్దల సమీపమందు సయితము సమయమునకు తగిన వ్యాపారము వదలఁబడలేదు.

తా.—నాయికానాయకులకు పెద్దలసన్నిధానముచేత సంభాషణకు వలనులేమింజేసి సంజ్ఞలచేత నే తగ్గనానునయములు జరిగినవి.—అది యెట్లన:— నాయిక 'అలదానికడకు నీవుపోలేదా?' అనునర్థముగా దానితావును బొమసంజ్ఞచేతసూచింపఁగా, నాయకుఁడు 'పోలేద' నునర్థముగా తలను అడ్డముగా ఆడించినాఁడు. నాయిక 'నీవు పోఁగా చూచినట్టిది ఇదిగో నా సఖి, సాక్షిణి యున్నది' అనునర్థముగా ఆవృత్తాంతమెఱిఁగినతనచెలి వైపు చూడఁగా, నాయకుఁడు తనగుట్టుబయటఁబడియెనుగదా అని భయపడి నాయికకు మ్రొక్కి ఏమియుం దోఁపనివాఁడై యుండెను. అట్లతఁడు తనదోషమును ఒప్పుకొన్నందున సందేహముతీఱుదు, నాయికముఖము కోపముచే నెఱు పెక్కఁగా నాయకుఁడు 'అపరాధిని నీకు పాదానతుఁడను ఈ నేరమును మన్నింపుము' అనునర్థముగా తనచూపులను ఆమెపాదములందు వ్రాల్చెను.

లో లేతి॥ నాయికాయాః-లోలభ్రూలతయా కమ్పమాన భ్రూవల్ల్యా- నాథ నేన - విపక్షదిగుపన్యాసె ప్రతికూలరమణీస్థాననిర్దేశే - సతి నాయకేన శిరో-విధూతం కమ్పితం - తత స్తయా నాయికయా - తద్వృత్తాన్త విదీక్షణే - స చాసౌ - వృత్తాన్తో వ్యాపారః - తం వే త్తీతి తద్వృత్తాన్త విత్ - సఖ్యాదిః - త స్యేక్షణమ్ అవలోకనం - తస్మిన్ కృతే సతి - తతో నాయకః - కృతమనస్కృతిర్ధ్యాత్వా - విలక్షః కిఙ్కర్తవ్యతా మూఢ స్సన్-స్థితః తస్థౌ - తస్యా నాయికాయాః-ముఖే ఈషత్తామ్రకపోలకాన్తిని అరుణగణ్డద్యుతౌ సతి - తతో నాయకో - దృష్ట్యాదృశా - పాదయో - ర్నతః నమ్రః ఏవం - ద్వాభ్యాం స్త్రీపుంసాభ్యాం - గురుసన్నిధౌ గురుజన సమక్షేఽపి - కాలోచితః అవసరోచితః - విధిః కృత్యం - నోత్సృష్టః న త్యక్తః-నివర్తిత- ఇ త్యర్థః ఇతి సంబన్ధః. అత్ర 'దిగుపన్యాస' ఇ త్యనేన

త్వం తస్యాగృహం గత ఇత్యయమర్థః సూచితః. 'శిరో విధూత' మిత్యనేన తద్గృహగమనం నాస్తీతి జ్ఞాపితమ్. 'తదప్యత్రాన్తవిదీక్షణ'ఇత్యనేన అనయా సఖ్యా తవ అపరాధో దృష్ట ఇతి సూచితః. 'కృత నమస్కారో విలక్షస్మిత' ఇత్యనేన స్వకృతాపరాధోఽఙ్గీకృత ఇతి సూచితమ్. 'ఈష త్తామ్రకపోలకాన్తిని' త్యనేన కోప స్సూచితః. 'దృష్ట్వా నతః పాదయో రి' త్యనేన అహ మపరాధీ క్షమ స్వేతి సాన్త్వనం సూచితమ్. 'గురుసన్నిధా వపికాలోచితో విధ ర్నోక్తస్పృష్ట' ఇత్యనేన తదానీ మనుచితోఽపి ఈషాత్యమానశ్చ తత్ప్రశమనప్రకార శ్చ స్వవైదగ్ధ్యం నిగూఢం నివర్తయ తీ త్యభిప్రాయః. నాయికా స్వీయా, మధ్యా ప్రగల్భా వా. నాయక శ్శఠః. విప్రలమ్భశృఙ్గారః. చేష్టాకృత మీర్ష్యాక్రోధప్రాయం వచః. జాతి రలంకారః. ౬౯

---

దృష్టః కాతరనేత్రయా చిరతరం, బద్ధ్వాఽఞ్జలిం యాచితః,
పశ్చా దంశుకపల్లవే చ విధృతో, నిర్వ్యాజ మాలిఙ్గితః,
ఇత్యాక్షిప్య సమస్త మేవ మఘృణో గన్తుం ప్రవృత్త శ్శఠః,
పూర్వం ప్రాణపరిగ్రహో దయితయా ముక్త స్తతో వల్లభః.

నాయిక ఏయుపాయము చేసినను ఆఁగక కోపవ్యాజమున శఠుఁడు ఏఁగుట.—(ప్రయోగవ్యత్యయము.—) కాతర నేత్రయా చిరతరం దృష్టః= దీనమయిన దృష్టిగలదై (నాయిక) చాలసేపు (నాయకుని) చూచినది, అఞ్జలిం బద్ధ్వా యాచితః = దోసిటిని కూర్చి వేఁడుకొన్నది, (కిం) చ పశ్చాత్ అంశుక పల్లవే విధృతః = మఱియు అటుతర్వాత వలువచిగురు నందు పట్టుకొన్నది, నిర్వ్యాజమ్ ఆలిఙ్గితః = నిష్కపటముగా కవుఁగిలించినది, ఇతి సమస్తమ్ ఆక్షిప్య=దీనిని అంతయు త్రోసివైచి, ఏవమ్ అఘృణః (సన్) శఠః గన్తుం ప్రవృత్తః=ఈప్రకారముగా కరుణలేనివాఁడై ధూర్తుఁడు పోవుటకుఁ గడంగినవాఁడాయెను, (అంతట), దయితయా పూర్వం ప్రాణ

పరిగ్రహః తతః వల్లభః ముక్తః=ప్రియ ముందుగా జీవితముమీఁది యాశను అనంతరము ప్రియుని వదలినది.

నాయకుని పోవలదని నాయిక దీనదృష్టుల చాల సేపు చూచుచుండినది, తర్వాత దోసిలి యొగ్గి వేఁడుకొన్నది, అనంతరము వలువకొనం బట్టి యాఁపినది, నిష్కపటముగా కవుంగిలించుకొన్నది ఇట్లేమి చేసినను మనస్సు కరంగక ధూర్తుఁడు ఆమెను వదలి చనంగడంగెను; అంత నామె ప్రాణత్యాగము చేసికొన నిశ్చయించుకొన్నదై యతనిని పోనిచ్చెను.

అవ ॥ ప్రణయకోపవ్యాజేన యత్ర కుత్రాపి జిగమిషుం నాయకముత్ప్రేక్ష్య తస్య గమన మసహమానాయా నాయికాయాః వ్యాపారం కవి రాహ - దృష్ట ఇతి ॥ కాతర నేత్రయా దీనదృష్ట్యా - నాయికయా చిరతరం సుచిరం - దృష్టస్తతో౽ఞ్జలింబద్ధ్వా సంయమ్య - యాచితః ప్రార్థితః - పశ్చాత్ తదను - అంశుకపల్లవే చేలాఞ్చలేచ - విధృతో గృహీతః - తతో - నిర్వ్యాజం నిష్కపటం - యథాతథా ఆలిఙ్గితః ఇత్థం ధూర్తం - సమస్తం దర్శనాదిక - మాక్షిప్య నిరస్య - ఏవ మనేన ప్రకారేణ-శఠో ధూర్తః - అఘృణో నిర్దయః స్వకా - గన్తుం ప్రవృత్తః తతి స్తయా దయితయా-పూర్వం ప్రథమం - ప్రాణపరిగ్రహః ప్రాణానా మసూనాం - పరిగ్రహః అవలమ్బనం-జీవితాశేత్యర్థః - ముక్తః విసృష్టః-తతో వల్లభో ముక్త ఇతి సంబన్ధః. 'దృష్టః కాతర నేత్రయే,' త్యనేన నాయికాదైన్యం సూచితమ్, 'బద్ధ్వా౽ఞ్జలిం యాచిత' ఇత్యనేన తస్యా దైన్యం విది త్వాపి నానుకూల్యం గత ఇతి సూచితమ్. 'అంశుకపల్లవే విధృత' ఇత్యనేన యాచ్ఞా నిష్ఫలీకృ తేతి జ్ఞాయతే, 'నిర్వ్యాజ మాలిఙ్గిత' ఇత్యనేన అంశుకపల్లవ మాత్రావలమ్బనేన నివారయితుం న శక్య ఇతి జ్ఞాయతే, 'పూర్వం ప్రాణపరిగ్రహో ముక్తస్తతో వల్లభ'ఇత్యనేన తస్యా రాగాతిశయ స్సూచిత ఇత్యభిప్రాయః. దైన్యం నామ సఞ్చారీ భావః. నాయికా

స్వీయా మధ్యా చ. నాయకశ్శఠః. విప్రలమ్భశృఙ్గారః. అత్ర సఙ్కేచ్ఛా
రూపం శృఙ్గారి నర్మ. ఆక్షేపాలంకారః. 20

లాక్షాలక్ష్మ లలాటపట్ట మభితః, కేయూరముద్రా గళే,
వక్త్రే కజ్జలకాళిమా, నయనయో స్తామ్బూలరాగోఽపరః,
దృష్ట్వా కోపవిధాయి మణ్డన మిదం ప్రాత, శ్చిరం ప్రేయసో
లీలాతామరసోదరే మృగదృశ శ్శ్వాసా స్సమాప్తిం గతాః.

పరస్త్రీ సంభోగ చిహ్నితుని వేఁకువ నింటికి వచ్చిన కాంతునిం గని నాయిక చిహ్నములచే వృత్త మెఱింగి తనదుఃఖమును డాఁగురించుట.—

లలాట పట్టమ్ అభితః లాక్షా లక్ష్మ = పలకవంటి నొసట చుట్టును లత్తుకగుఱుతు (ఇది సవతియడుగులనుండి ఆమెకు నాయకుఁడు చాఁగిలంబడినప్పుడు అంటుకొన్నది), గళే కేయూర ముద్రా = మెడయందు భుజకీర్తుల యొత్తుడును (ఇది ఆలింగనము చేత కలిగినది) వక్త్రే కజ్జల కాళిమా = నోటికడ కాటుక నలుపు (ఆసవతికన్నుల నతఁడు ముద్దుగొనుటచేత, నయనయోః అపరః తాంబూల రాగః = కనులందు (జాగరపుఁగెంపు గాక) పైగా తమ్మలంపుఁగెంపు (ఆమె యితనికన్నులను ముద్దుగొనుటచే), కోపవిధాయి ప్రేయసః ఇదం మణ్డనం ప్రాతః దృష్ట్వా = కోపము కలిగించుదానిని ప్రియతమునియొక్క యీ యలంకారమును వేఁకువను చూచి (చూడఁగా), మృగదృశః శ్వాసాః లీలా తామరస ఉదరే సమాప్తిం గతాః = నాయికయొక్క నిట్టూర్పులు విలాసార్థమైన (విలాసార్థముచేత సంచుకొనఁబడియున్న) తమ్మి లోపల లయమును పొందినవి (నాయిక ఆతామరను ఆఘ్రాణించు వ్యాజమున దుఃఖనిశ్శ్వాసములను దాఁపరించినది).

కవే ర్వాక్యమ్ - లాక్షేతి - లలాటపట్ట మభితః ఫాలఫలకస్య ప్రాన్తేషు 'అభితఃపరితః' ఇత్యాదినా ద్వితీయా - లాక్షా లక్ష్మ అలక్తక లాఞ్ఛనం - గళే కణ్ఠే - కెయూరముద్రా అఙ్గదాఙ్కం - వక్త్రే ముఖే -

కజ్జలకాళిమా అఞ్జనమాలిన్యం- నయనయోస్తామ్బూలరాగః తామ్బూలరక్తి
మా-అపర ఇతరో రాగశ్చ నిద్రాఖేదజనిత ఇత్యర్థః- ప్రాత రుషసి-ప్రేయ
సః ప్రియతమస్య - కోపవిధాయి రోషవిధాయి - ఇదం - పూర్వోక్తం
మండనం సంభోగచిహ్నరూప మలంకారం - దృష్ట్వా స్థితాయాః - మృగ
దృశో హరిణేక్షణాయాః - శ్వాసాః శ్వాసశబ్దేన రోషాతిశయజనితనిశ్వాసో
చ్ఛ్వాసాః కథ్యన్తే - లీలా తామరసోదరే విలాస కమలగర్భే-సమాప్తి
మవసానం - గతా ఇతి సంబన్ధః. 'లాక్షాలక్ష్మ లలాటపట్ట మభితః' ఇత్యనేన
నాయకేన కృతః ప్రతినాయికాచరణప్రణామో గమ్యతే, 'కేయూరముద్రా
గళే' ఇత్యనేన తయా కృతం కణ్ఠాలిఙ్గనం గమ్యతే, 'వక్త్రే కజ్జలకాళిమే' ఇ
త్యనేన తేన కృతం తస్యా నయనచుమ్బనం గమ్యతే, 'నయనయో స్తా
మ్బూలరాగ' ఇత్యనేన తయా కృతం తస్య నయనచుమ్బనం గమ్యతే,
'లీలాతామరసోదరే మృగదృశశ్శ్వాసా స్సమాప్తిం గతా' ఇత్యనేన
సౌరభ్యాఘ్రాణం వ్యపదిశ్య కృతేన రోషవికారశ్వాసగోపనేన నాయికా
యా ధైర్యం వ్యజ్యతే. అత్ర అవహిత్థం నామ సఞ్చారీ భావః. నాయికా
స్వీయా ధీరా ప్రగల్భా చ, కిం చ ఖణ్డితా. నాయకో ధృష్టః. వైమనస్యే
ర్ష్యాకృత విప్రలమ్భశృఙ్గారః - యథోక్తం భారతీయే -

'నిద్రాఖేదాలసగతిం సచిహ్నం సరదవ్రణం
ఏవం విధం ప్రియం దృష్ట్వా వైమనస్యం విధీయతే.' ఇతి.

అత్ర చేష్టాకృత నిగూఢేర్ష్యాక్రోధప్రాయం నర్మ. యుక్తి రలంకారః. ౭౧

---

అద్యారభ్య న హి ప్రియే పున రహం
మానస్య వా భాజనం,
గృహ్ణీయాం విషరూపిణ శ్శఠమతే
ర్నామాపి సంక్షేపతః,

కిం తే నైవ వినా శశాఙ్కకిరణ
స్పష్టాట్టహాసా నిశా
నైకో వా దివసః పయోదమలినో
యాయాన్మ ప్రావృషి? ౭౨

నాయకునిమీఁద నలిగి నాయిక క్షమింప నొల్లక మరణమొంద నిశ్చయించుకొనుట.—అద్య ఆరభ్య ప్రియే అహం మానస్య భాజనం న హి భవామి = ఇది మొదలుగా కాంతునిమీఁద నేను కోపమునకు పాత్రమను కానే కాను, కిం) వా = మఱియు, విషరూపిణః శఠమతేః నామ సంక్షేపతః అపి న గృహ్ణీయామ్ = విషస్వరూపుఁడును వంచకబుద్ధిగలవాఁడును అయిన యతనియొక్క నామధేయమును సంగ్రహముగా నేనియు ఉచ్చరింపను, తేన వినా = అతఁడు (చెంత) లేకుండ, శశాఙ్క కిరణ స్పష్ట అట్టహాసా నిశా వా = (శరత్కాలమందు) చంద్రుని వెలుఁగులనెడు స్ఫుటమయిన బొబ్బనవ్వుగలదైన రాత్రి గాని, ప్రావృషి పయోద మలినః ఏకః దివసః వా= (వర్షాకాలమందు) మొగిళ్లచే కాఱుకొన్న యొక పగలు గాని, న యాయాత్ కిమ్ = రాదా యేమి?

తా.—ఇఁక నేను ప్రియునిమీఁద అలుగను, ఆవిషస్వరూపుని యొక్క ఆవంచనాపరునియొక్క పేరయినను పేరియొక్క భాగము నయి నను వాకొనను. అతఁడు లేనప్పుడు నాకు శరత్కాలమందు వెన్నెల యనెడు బొబ్బనవ్వుతోడిరాత్రి యొకటి రాదా? వర్షాకాలమందు మొగిళ్లతో కాఱుకొన్న పగ లొక్కటి రాదా? (ఆ వెన్నెల రాత్రియు ఆదుర్దినంబును నాప్రాణమును హరించును, అంతట నావెత తీఱును, అనుట).

మానం ముఞ్చేతి సఖ్యా ప్రార్థితా నాయికా కోపాతిశయేన తాం ప్రత్యాహ-అ ద్యేతి ॥ అ ద్యారభ్య అద్య ప్రభృతి - ప్రియే వల్లభ విషయే - అహం - పున ర్భూయః - మానస్య కోపస్య - భాజనం ఆశ్రయో - న భవామి - అథవా - విషరూపిణో విషరూపస్య - శఠమతేః

కపట బుద్ధిః - నామ - సంక్షేపతోఽపి కించి దపి - న గృహీతాయాం నోచ్చారయేయం. తేన వి నైవ స్థితాయా మమ ప్రియతమేన విరహితాయా ఏవ మమ - శశాఙ్క కిరణ స్పష్టాట్టహాసా చన్ద్రమరీచివ్యక్తా తిహాసా అతి ప్రకాశే త్యర్థః - న యాయాత్కిం న ప్రాప్నుయా త్కిం - పయోద మలినో మేఘశ్యామః-ప్రావృషి వర్షాకాలే-ఏకో దివసో వా న యాయా త్కి మితి సంబన్ధః అత్ర అనర్థహేతుశరత్కాలరాత్రి ర్వా వర్షా కాలదివసో వా న యాయా త్కి మి త్య నేన నాయికాపృథా సాహసం ప్రకటిత వ తీతి సూచ్యతే. నాయికా స్వీయా, మధ్యాచ. నాయక శ్శఠః. మానకృతో విప్రలమ్భశృఙ్గారః. ఈర్ష్యా క్రోధప్రాయం నర్మ. జాతి రలఙ్కారః. 22

---

శ ఠాన్యస్యాగ కాఞ్చీమణిరణిత మాకర్ణ్య సహసా
య దాశ్లిష్య న్నేవ ప్రశిథిలభుజగ్రన్థి రభవః!
త దేత త్క్వాచక్షే! ఘృతమధుమయత్వ్బహువచో
విషే ణాఘూర్ణన్తీ కి మపి న సఖీ మే గణయతి! 23

నాయిక ధూర్తనాయకుని దూరుట—

(హే) శఠ ఆశ్లిష్యన్ ఏవ అన్యస్యాః కాఞ్చీ మణి రణితమ్ ఆక ర్ణ్య ప్రశిథిల భుజగ్రన్థిః అభవః = (ఓయి) వంచకుఁడా (నీవు) (నన్ను) కౌఁగిలించుచునే పెరవనితయొక్క మొలనూలి రత్నముల నాదమును విని సడలినబాహువుల ముడికలవాఁడవు అయితివి, తత్ ఏతత్ క్వ ఆచక్షే = ఆ దీనిని ఎప్పట చెప్పఁకొందురు, ఘృత మధుమయ త్వత్ బహు వచో విషేణ ఆఘూర్ణన్తీ మే సఖీ = నేతితోఁడి తేనెవంటి నీ పెక్కు మాట లనెడు విషముచేత మైకమొందినదై నా చెలి, కిమ్ అపి న గణయతి - దేనిని గాని విచారింపదు.

తా.— నీవు న న్నాలింగించుచునే దానిమొలనూలిమణిరవళి వినఁబడినమాత్రాన కౌఁగిలి సడలించితివి. నీమాటలకు మోసపోయి నాతో నీ పక్షముగా వాదించునదైన నాచెలి నీయిట్టినడవడిని దేనిని సరకుగొనదు, మఱి ఈదుఃఖమును చెప్పుకొనుటకేని నా కెవ్వరును లేరు, ఏమిచేయుదును.

ఘృత... నేయి తేనెల సమాంశమిశ్రము రుచ్యమే గాని విషము.

శ ఠేతి ॥ హే - శఠ ధూర్త - అన్యస్యా ఇతరనాయికాయాః - కాఞ్చీ మణి రణితం మేఖలా కిఙ్కిణీ శిఞ్జితమ్ - ఆకర్ణ్య - ఆశ్లిష్య న్నేవ ఆలిఙ్గ న్నేవ - సహసాశీఘ్రం - ప్రశిథిల భుజగ్రన్థి శ్లిష్టబాహుబన్ధః - అభవ ఇతి య త్తదేతత్ కార్యం-కస్యాచక్షే కుత్ర బ్రవీమి - యతః - ఘృతమధుమయత్వద్బహువచోవిషేణ - ఘృతమధుమయం సర్పిరాదిస్వరూపం - త్వ ద్బహువచ స్తవ భూరివచనం - ఘృతమధుమయం చ తద్వద్బహువచ శ్చ త దేవ విషం తేన - ఆఘూర్ణ న్తీ భ్రమ న్తీ - మేసఖీ కి మపి - న గణయతి న విచారయతి న విశ్వసి తీ త్యర్థః - వచన మితి శేషః; ఇతి సంబన్ధః. అత్ర నాయకవచసాం ఘృతమధుమయత్వకథనేన తదానీం హితత్వం పశ్చా దహితత్వం చ గమ్యతే - యతఃఘృతం మధుమిశ్రితం విపాకే విషత్వ మాపద్యతే - యథో క్తం వాగ్భటేన -

'మధుసర్పివసాతైల పానీయాని ద్విశ స్త్రిశః
ఏక త్రైవ సమాంశాని విరుధ్యేతే పరస్పరమ్'. ఇతి.

'త దేతత్కాచక్షే' ఇ త్యనేన సఖీ త్వయా వఞ్చితా క స్యా అగ్రతో మమ దుఃఖంని వేదయామీతి నిర్వేద స్సూచితః. అత్ర నాయికా స్వీయా, ప్రగల్భా చ. నాయకశ్శఠః. విప్రలమ్భశృఙ్గారః. అత్ర సోపాలమ్భ వచనం నర్మ. ఆక్షేపోఽలంకారః. 23

---

శూన్యం వాసగృహం విలోక్య, శయనా
దుత్థాయ కించి చ్ఛనైః,

ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం
నిర్వర్ణ్య పత్యు ర్ముఖమ్.
విస్రబ్ధం పరిరభ్య, జాతపులకా
మాలోక్య గణ్డస్థలీం,
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా
బాలా చిరం చుమ్బితా. ౨౮

బాలా=బాలిక, శూన్యం వాస గృహం విలోక్య=విజనమైన పడక టింటినిగాంచి, శనైః కించిత్ ఉత్థాయ = మెల్లగా ఇంచుక లేచి (నదై), నిద్రా వ్యాజమ్ ఉపాగతస్య పత్యుః ముఖం సుచిరం నిర్వర్ణ్య=నిద్రయను కపటమును (కపటనిద్రను) పొందినవాఁడైన భర్తయొక్క మోమును చాల సేపు కాంచి, విస్రబ్ధం పరిచుమ్బ్య=జంకులేకుండ ముద్దుగొని, జాత పులకాం గణ్డ స్థలీమ్ ఆలోక్య లజ్జా నమ్ర ముఖీ=పొడమిన పులకలుగలదైన చెక్కిటి ప్రదేశమును చూచి సిగ్గుచే వంగిన మోముగలదై, హసతా ప్రియేణ చిరం చుమ్బితా=నవ్వుచున్న దయితునిచే చాలసేపు ముద్దుగొనఁబడినది.

తా.—ఒకానొకబాల లజ్జావతి సఖ్యాదులు పోయి పడకటిల్లు విజన మయిన దని యెఱింగి, మెల్లగా పడకనుండి యించుకంత లేచినదై కపట సుప్తుడైన కాంతునిముఖమును చాల సేపు పరికించి నిద్రితుఁడే యని నమ్మి జంకు మాని ముద్దుగొని, అంత నతనిచెక్కులంబొడమిన పులకలం గాంచి కపటనిద్ర యని యెఱింగి, తనబేలతనమునకు లజ్జితయై మోము వాంచినది. అంత నాతఁడు ఆమెను నవ్వుచు చాలసేపు ముద్దుగొనియెను.

కవే ర్వాక్యమ్ - శూన్య మితి ॥ శూన్యం వివిక్తం - వాసగృహం కేళీ భవనం - విలోక్య వీక్ష్య - శయనా త్తల్పా - త్పర్యంకా దీష - దుత్థాయ ఉత్థితా భూత్వా - శనైః మన్దం నిశ్శబ్ద మిత్యర్థః - బాలా నిద్రావ్యాజ ముపాగతస్య కపటనిద్రాం ప్రాప్తస్య - పత్యుః ప్రియస్య -

ముఖం - సుచిరం నిర్వర్ణ్య = దీర్ఘకాలం విలోక్య - సమ్యక్పరీక్ష్యే
త్యర్థః - విస్రబ్ధం నిశ్శఙ్కం యథా భవతి తథా-పరిచుమ్బ్య ఆస్వాద్య-
జాతపులకా ముత్పన్న రోమాఞ్చాం - తస్య గణ్డస్థలీ - మాలోక్య -
లజ్జానమ్రముఖీ సతి వ్రీడావనతవదనా సతీ - హసతా ప్రియేణ చిరం
చుమ్బితాఽభవ దితి సంబన్ధః. స్పష్ట ఏ వాభిప్రాయః ఔత్సుక్యం నామ
సంచారి భావః. నాయికా స్వీయా ముగ్ధాచ. నాయకోఽనుకూలః.
సంభోగశృఙ్గారః. నర్మగర్భః. జాతి రలంకారః. ౭౪

---

పాదాసక్తే సుచిర మిహ తే వామతా నైవ కాన్తే,
మన్దారబ్ధే ప్రణయిని జనే కోపనే కోఽపరాధః ?
ఇత్థం తస్యాః పరిజనగిరా కోపవేగే ప్రశాన్తే,
బాష్పోద్భేదై స్తదను సహసా న స్థితం న ప్రవృత్తమ్.

(హే) కోపనే = (ఓ) కోపశీలురాలా, తే సు చిరం పాద ఆసక్తే ఇహ కాన్తే వామతా న ఏవ = నీకు కడుం దడవు అడుగులం జేరియున్న యీ కాంతునియందు దోషము లేనే లేదు, మన్ద ఆరబ్ధే ప్రణయిని జనే అపరాధః కః = ఉడిగన ప్రతివాదముగలవాఁడయిన ప్రేముగలవాఁడయిన జనునియందు దోషము ఏమి, ఇత్థం పరిజన గిరా తస్యాః కోప వేగే ప్రశాన్తే (సతి) = ఇట్లు పరిజనుల మాటచేత ఆమెకు కోపముయొక్క ఉద్రేకము చల్లారినది (కాఁగా), తత్ అను సహసా బాష్ప ఉద్భేదైః న స్థితం న ప్రవృత్తమ్ = ఆ వెంటనే తటాలున కన్నీటి యుప్పొంగుటలు నిలువ వాయెను సాగవాయెను.

తా.---ఈవిధంబున ఇంతసేపు నీపాదములందుఁ ద్రెళ్లియున్న యీ కాంతునియందు ఏతప్పును లేదు. ఉండెనుబో నీకు కోపమగు నని తననిర్దోషతను స్థాపించుకొనుటకు సయితము యత్నింపకున్నట్టి యిట్టి యనురక్తుని

యందు ఇంకను దోషమా ? ఇట్లు చెలులు పలికినంతట కోపము చల్లారుడు నాయికకు తటాలున బాష్పము లుప్పతిల్లి నిలువకయు వెలువడకయు నుండినవి.

కవే ర్వాక్యమ్ - పాదాసక్త ఇతి ॥ హే కోపనే కోపశీలె - సుచిరం దీర్ఘం కాలం - పాదాసక్తె చరణలగ్న్యె - ప్రణత ఇత్యర్థః - ఇహ అస్మిన్ - తే తవ - కాన్తే ప్రియే - వామతా వక్రతా - నైవ నాస్త్యేవ - మన్దారమ్భే శాన్తోపక్రమె - అత్ర ఆరమ్భో నామ 'మ య్యప రాధః కృత ?' ఇతి సమగ్గోఽభియోగః - ప్రణయిని ప్రేమవతి - జనె - అపరాధః కః ఆగోఽపి న - అయ మపరాధోఽపి అపరాధత్వేన న గణనీయ ఇత్యర్థః - ఇత్థ మేవం - పరిజనగిరా సఖ్యాదివచనేన - తస్యా నాయికాయాః - కోపవేగ రోషోద్రేకె - ప్రశాన్తే క్షీణే సతి - తదను తతః పశ్చాత్సహసా శీఘ్రం - బాష్పోద్భేదె నయన జలోద్గమె - నచ స్థితం నోషితం - న ప్రవృత్తం న ప్రస్థితమ్ - ఇతి సంబన్ధః. 'బాష్పోద్భేదః న స్థిత మి'త్యనేన పరిజనానునయా త్కోపస్య వేగే శాన్తే ప్రసాదో న్ముఖత్వం సూచితం, బాష్పోద్గమస్య ప్రసాదసూచికత్వాత్; 'న ప్రవృత్త' మిత్యనేన ప్రియాపరాధస్య ప్రత్యక్షదృష్టత్వా త్కోప స్తు సహసా న ప్రశాన్త ఇత్యర్థ స్సూచితః. అత్ర నాయికా స్వీయా-మధ్యాప్రగల్భయో రన్యతరా. నాయక శ్శఠః. విప్రలమ్భశృఙ్గారః. జాతి రలంకారః. ౭౫

---

కథ మపి కృతప్రత్యాసత్తౌ ప్రియే స్ఖలితోత్తరె,
విరహకృశయా కృత్వా వ్యాజం ప్రకల్పిత మశ్రుతమ్;
అసహనసఖీశ్రోత్రప్రాప్తిం విశఙ్క్య ససంభ్రమం
వివలితదృశా శూన్యే గేహే సముచ్ఛ్వసితం పునః. ౭౬

(ప్రయోగవ్యత్యయము.—) కథమ్ అపి కృత ప్రత్యాసత్తౌ ప్రియే స్ఖలిత ఉత్తరే (సతి)=ఎట్టకేలకు చేయఁబడిన పునరాగమనముకలవాఁడయిన

(మఱులవచ్చిన) కొంతుఁడు తప్పిన బదులుమాటకలవాఁడు (కాఁగా) (సవతిపేర ఈమెను పిలిచి యుత్తరము చెప్పఁగా), విరహ కృశయా వ్యాజం కృత్వా అశ్రుతం ప్రకల్పితమ్=ఎడఁబాపుచే చిక్కియున్న (నాయిక) మిష కల్పించి వినమిని చేసినది (విననట్లు నటించినది), అసహన సఖీ శ్రోత్ర ప్రాప్తిం విశఙ్క్య = ఓలుపనివారయిన చెలుల చెవులను పొందునను (ఇతఁడు సవతిపేర తన కుత్తరము చెప్పుటను విన్నయెడల తనసఖులు ఇతనిపై కోపగింతు రని) వెఱచి, ససంభ్రమం వివలిత దృశా గేహే శూన్యే సతి పునః సముచ్ఛ్వసితమ్ = వేగిరపాటుతో త్రిప్పఁబడిన చూపుగలదై (నలుదెసలం బరికించి) ఇల్లు శూన్యము కాఁగా (ఆయింట సఖు లెవ్వరును లేమిని కని) వెండియు ఊఁఱడిల్లినది.

నాయిక అపరాధిని నాయకుని కోపముచే వెడలఁగొట్టి కృశించుచుండినది, మఱల నతఁ డెట్టకేలకు వచ్చి ఆమెమాటకు బదులు సవతిపేర ఆమెను పిలిచి చెప్పఁగా అపు డతనిపై యాగోత్రస్ఖలనమునకై కోపించిన నతఁడు మఱల వెడలిపోవు నను భయముచేతను ఆవియోగమును మఱి భరింపఁజాలమిచేతను ఆగోత్రస్ఖలనమును తాను విననట్లు ఏదో మిషచేసినది. తాను అట్లు ఉపాయము చేసి భావివియోగమును తప్పించుకొన్నను తనసఖు లెవ్వరయినను విన్నచో అతనిమీఁద కోపగించి నిందించి మఱల నతఁడు లేచిపోవునట్లు చేయుదు రనుభయముచే ఇల్లు నలుదెసలం బరికించి వా రెవ్వరును లేమి నెఱింగి యూఱడిల్లినది.

కవే ర్వాక్యమ్-కథ మితి కథంచిత్-కృతా-ప్రత్యాసత్తిః పునరాగమనం - యేన స తథోక్తః-అత్ర కోపా న్నిష్కాసితస్య పునః ప్రాప్తిః-ప్రత్యాసత్తిః - ప్రియే దయితే - స్ఖలితోత్తరే సతి - స్ఖలితం విపర్యస్తం-ఉత్తరం ప్రతివాక్యం - యస్య స తథోక్తః కృతగోత్రస్ఖలన-ఇత్యర్థః - విరహకృశయా వియోగక్షామయా - నాయికయా వ్యాజం కపటం-కృత్వా విధాయ - కిమపి వ్యాజీకృ త్యే త్యర్థః - అశ్రుత మశ్రవణం-ప్రకల్పితం

కృతమ్ - అశ్రుత మభినీత మిత్యర్థః - అసహనసఖీశ్రోత్రప్రాప్తి - మస
హనాః అసహిష్ణవః-తాశ్చ తాస్సఖ్యస్తాసాం - శ్రోత్రం శ్రవణం - తస్య
ప్రాప్తి స్తాం - విశఙ్క్య శఙ్కిత్వా - ససంభ్రమం-సత్వరం యథా భవతి
తథా - వివలితదృశా పార్శ్వవ్యాపారితదృష్ట్యా తయా - గేహే - శూన్యే
వివిక్తే సతి - నిర్గతసఖీజన ఇత్యర్థః - భూయః - పున - స్సముచ్ఛ్వ
సితం ఉచ్ఛ్వాసః కృత - స్సంతుష్ట మిత్యర్థః - ఇతి సంబన్ధః. 'విరహ
కృశయా వ్యాజం కృత్వా అశ్రుతం ప్రకల్పిత' మి త్యనేన పున ర్విరహ
భీరుత్వం సూచితం, సఖీ నా మ సహనత్వకథ నేన నాయకాపరాధే నాయి
కయా సోఢేఽపి తాసాం తత్పరిభవాసహత్వేన తస్యాం సౌహార్దాతిశయ
స్సూచితః. శఙ్కా నామ సఞ్చారీ భావః. నాయికా స్వీయా మధ్యా చ,
నాయకో ధృష్టః. మానానన్తర సంభోగ శృఙ్గారః. అత్ర జాతి
రలంకారః. ౭౬

---

ప్రత్యాశ్లేష. వికీర్ణచన్దనరజః
పుఞ్జప్రకర్షా దియం
శయ్యా సంప్రతి కోమలాఙ్గి పరుషే
త్యారోప్య మాం వక్షసి
గాఢోష్ఠ గ్రహపీడనాకులితయా
పాదాగ్ర సందంశకై
ర్నాకృష్యామ్బర మాత్మనో యదుచితం
ధూర్తేన త త్ప్రస్తుతమ్. ౭౭

నాయిక చెప్పుట.—(హే కోమలాఙ్గి = (ఓ) మృదుగాత్రీ, ఇయం
శయ్యా సంప్రతి ప్రత్యాశ్లేష వికీర్ణ చన్దన రజః పుఞ్జ ప్రకర్షాత్ పరుషా
ఇతి=ఈ పడక ఇప్పుడు ఒండొరులకవుంగిలింతలచేత రాలిన గంధపుం బొడి

మొత్తముయొక్క అతిశయమువలన ఒత్తుకొనుచున్నది అని (అను హేతువు చెప్పి), మాం వక్షసి ఆరోప్య = నన్ను ఱొమ్మున పరుండఁబెట్టుకొని, గాఢ ఓష్ఠ గ్రహ పీడన ఆకులతయా = గట్టిగా పెదవికొఱుకుటవలననైన నొప్పి చేత కలఁగినదాననగుటచేత, పాద అగ్ర సందంశకేన అమ్బరమ్ ఆకృష్య= అడుగుకొనయనెడు పట్టుకారుతో (నా)వలువను ఊడలాగి, ధూర్తేన ఆత్మనో యత్ ఉచితం తత్ ప్రస్తుతమ్ = (ఆ) మోసగాఁడు తనకు ఏది (ఏపని) తగినదో దానిని ఆరంభించినాఁడు.

తా.— పడకలో ఆలింగములచే రాలినగందపుఁబొడి ఒత్తుకొనునని మిషపెట్టి నన్ను తనఱొమ్ముపై పరుండఁబెట్టుకొని గట్టిగా చుఱుక్కున నాయధరము నాని ఆనొప్పికి నేను ఆకులపడుచున్న సమయములో తనకాలికొనతో పట్టుకారుతోనుంబోలె నావలువను లాగివైచి యామోసగాఁడు తనకు తగినకృత్యముం గావించినాఁడు.

అవ॥ నాయికావాక్యమ్ - ప్రత్యాశ్లేషేతి॥ హే కోమలాఙ్గి మృద్వఙ్గి - ప్రత్యాశ్లేషవికీర్ణచన్దనరజః పుఞ్జప్రకర్షాత్ - ప్రత్యాశ్లేషేణ ఆలిఙ్గనేన - వికీర్ణం చ్యుతం - యచ్చన్దనరజః తస్య-పుఞ్జః స్సమూహః - తస్య - ప్రకర్షః అతిశయః - తస్మాదియం - శయ్యాతల్పం - సంప్రతి- పరుషా కర్కశా - పశ్యేత్యుక్త్వా మాం వక్షస్యారోప్యగాఢోష్ఠగ్రహ పీడనాకులతయా - ఓష్ఠస్య అధరస్య - గ్రహః గ్రహణం - దంశన మిత్యర్థః-గాఢో దృఢః-స చాసావోష్ఠగ్రహశ్చ తేన - పీడనం వ్యథా- తే నాకులా తస్యాః భావః ఆకులతా-తయా హేతునా పాదాగ్ర సందంశకేన దంశకో నామ గ్రహణసాధనయన్త్రవిశేషః పాదాగ్ర మేవ సందంశకః తేన - అమ్బరం అంశుకం - మదీయ మితి శేషః - ఆపాకృష్యాపవార్య-ధూర్తేన కితవేన - ఆత్మనః స్వస్య- య దుచితం కర్మ - తత్ప్రస్తుత మాచరిత-మితి సంబన్ధః. నాయికా స్వీయా మధ్యా చ. నాయకోఽనుకూలః. సమ్భోగశృఙ్గారః. అత్ర నమర్గర్భః. యుక్తిరలంకారః. ౭౭

అచ్ఛిన్నం నయనామ్బు బన్ధుషు కృతం,
చిన్తా గురు ష్వర్పితా,
ద త్తం దైన్య మశేషతః పరిజనే,
తాప స్సఖీ ష్వాహితః,
అద్య శ్వః పర నిర్వృతిం భజతి సా
శ్వాసైః పరం ఖిద్యతే,
విస్రబ్ధో భవ, విప్రయోగజనితం
దుఃఖం విభ క్తం తయా. ౭౮

దూతి నాయకుని నిందించుట.—తయా = ఆబాలచేత, అచ్ఛిన్నం నయన అమ్బుబన్ధుషుకృతమ్ = ఎడతెంపులేని కన్నీరు స్వజనమందు ఉంపఁబడినది, చిన్తా గురుషు అర్పితా = విచారము తల్లి లోనగు పెద్దలయందు ఉంపఁబడినది, దైన్యమ్ పరిజనే అశేషతః దత్తమ్ = దీనత్వము పరిచారక జనమున కెల్ల ఈఁబడినది, తాపః సఖీషు ఆహితః = సెగలు చెలులయందు ఉంపఁబడినది, (ఈవిధముగా), విప్రయోగ జనితం దుఃఖం విభక్తమ్ = ఎడఁబాపుచేత కలిగింపఁబడిన శోకము (బంధ్వాదులకు) పంచిపెట్టఁబడినది, సా శ్వాసైః పరం ఖిద్యతే =(ఇట్లు పంపకముచే దుఃఖము తీఱినందున ఇపుడు) ఆబాల ఊర్పులచేత మాత్రము బాధపడుచున్నది, అద్య శ్వః (వా) పర నిర్వృతిం భజతి = నేఁడో రేపో పూర్ణ సౌఖ్యమును పొందును, (కావున), విస్రబ్ధః భవ=నిశ్చింతుఁడవుగా నుండుము.

అర్థము పైకి.—ఆబాల కిపుడు కన్నీళ్లు, చింత, దీనత్వము, తాపమును, తీఱినవి; అవి (వరుసగా) బంధువులందు, గురువులందు, పరిజనులయందు, చెలికత్తెలయందును, చేరినవి. ఇట్లు ఈపంపకముచేత దానివియోగశోక మెల్ల తీఱిపోయినది. కాని ఇప్పటి కింకను శ్వాసములచేతమాత్రము బాధపడుచున్నది! నేఁడో రేపో ఆబాధయును తీఱి స్వస్థపడును; నీ

వేమియు ఆమెకై చింతింపవలదు. హాయిగా నుండవచ్చును. లోపలి ముఖ్యభావము.—నీ కై నవియోగముచేత బాలమూర్ఛిల్లియున్నది. చేతనము పోయినది, ఊపిరిమాత్ర మున్నది. నీవు ఒప్పరికించిన, నేఁడో ఱేపో మృతి నొందును. ఇప్పుడైన వచ్చి దాని ప్రాణముం గావుము.

అవ ॥ దూతికా నాయక ముపాలభతే-అచ్ఛిన్న మితి ॥ అచ్ఛిన్నం సన్తతం - నయనామ్బు అశ్రు-బన్ధుషు స్వజనేషు - కృత మర్పితం - చిన్తా విచారః - గురుషు జనన్యాదిషు - అర్పితా న్యస్తా-దైన్యం దీనత్వమ్-అశేషతః పరిజనే సర్వస్మి న్పరిచారకజనే - స్తప్త మ్యర్థేణ తసిల్ - దత్తం విహితం - తాప స్సంజ్వర - స్సఖీషు వయస్యాసు - ఆహితః నిక్షిప్తః - ఏవ మనేన ప్రకారేణ - తయా - విప్రయోగజనితం విరహోత్పాదితం - దుఃఖం - విభక్తం విభాగం ప్రాపితం - సా యతః - శ్వాసైః శ్వసితైః- పర మత్యర్థణం - ఛిద్యతే ఛిన్నా భవతి - తస్మా-ద ద్యాస్మిణ దివసే-శ్వో వా పరదివసే వా - పరనిర్వృతి మత్యన్తసౌఖ్యం-భజతి ప్రాప్నోతి- అతో-విస్రబ్ధో నిశ్చిన్తో-భ వేతి సంబన్ధః. 'పరనిర్వృతిం భజ తీ' త్యనేన మరణం సూచ్యతే, 'విస్రబ్ధో భవే' త్యనేన ఉపాలమ్భో గమ్యతే. అత్ర మూర్ఛానామ దశావిశేషః. నాయికా పరకీయా, కన్యా చ. అయోగ విప్రలమ్భ శృఙ్గారః. అత్ర సోపాలమ్భ వచనం నర్మ. ఆక్షేపోఽలంకారః.

---

'స్ఫుటతు హృదయం, కామః కామం కరోతు కృశాం తనుం,
న సఖి చటులప్రేమ్ణా కార్యం పున ర్దయితేన మే.'
ఇతి సరభసం కోపాటోపా దుదీర్య వచ స్తయా
రమణపదవీ సారఙ్గాక్ష్యా సశఙ్కిత మీక్షితా.                    ౭౯

(హే) సఖి=(ఓ) చెలియా, హృదయం స్ఫుటతు = (నా) గుండె బ్రద్దలయినను అగును గాక, కామః తనుం కామం కృశాం కరోతు=మన్మథుఁడు (నా) దేహమును మిక్కిలి చిక్కినదానినిగా (చేసినం) జేయును

గాక, మే పునః చటుల ప్రేమ్ణా తేన దయితేన న కార్యమ్ = నాకు ఇఁక అస్థిర స్నేహముకలవాఁడయిన యా ప్రియునితో పని లేదు, (ప్రయోగ వ్యత్యయము.—) ఇతి తయా సారఙ్గ అక్ష్యా కోప ఆటోపాత్ సరభసం వచః ఉదీర్య = ఇట్లని యా హరిణ లోచన అలుకయొక్క విజృంభణచేత వేగిరపాటుతో మాట పలికి, రమణ పదవీ స శఙ్కితమ్ ఈక్షితా=ప్రియుని మార్గమును భయముతో జూచినది.

'అస్థిరస్నేహుఁడయిన యాప్రియునితో నిఁక నాకు పని లేదు. ఇట్లు వదలుకొనుటచేత నాకు గుండె పగిలినను పగులనీ, ఒడలు ఎంత కృశించినను కృశింపనీ,' అని సఖితో నాయిక కోపవిజృంభణంబున మాట పలికినదై నాయకుఁడు వచ్చు త్రోవను వెఱపుతో తత్తరమున చూడసాగినది. పైకి బింకముగా ప్రియుని వదలుకొన్నట్లు పలికినను లోపల ఆశ పూర్ణముగానే బాధించుచునే యున్న దని భా.

అవ ॥ కవే ర్వాక్యమ్ - స్ఫుట త్వితి ॥ హే సఖి హృదయం - స్ఫుటతు దళతు - కామో మన్మథః - కామం-తనుం శరీరం - కృశాం కరోతు - మమ పునః-చటులప్రేమ్ణా చఞ్చల ప్రణయేన - దయితేన ప్రియేణ-న కార్యం ప్రయోజనం నా స్తీ-త్యనేన ప్రకారేణ- కోపాటోపా న్మానాతిశయా - త్సరభసం సత్వరం యథాభవతి తథా-వచః - ఉదీర్య ఉక్త్వా-తయా-సారఙ్గాక్ష్యా హారిణలోచనయా - సశఙ్కితం-రమణపదవీ ప్రియతమవర్త్మ-ఈక్షితా దృ ష్టేతి - సంబన్ధః. స్పష్ట ఏ వాభిప్రాయః. అత్ర చకితం నామ సఞ్చారీభావః. 'చకితం భయ సంభ్రమః' ఇ త్యుక్త త్వాత్. నాయికా స్వీయా మధ్యా చ; కిం చ కలహా న్తరితా. నాయక శ్శఠః. మానకృతో విప్రలమ్భశృఙ్గారః. అత్ర సభయం శృఙ్గారి నమః. జాతి రలంకారః. ౭౯

లీలాతామరసాహతోఽన్యవనితా
నిశ్శఙ్కదష్టాధరః
ప్రేయా న్కేసరదూషితేక్షణ ఇవ
వ్యామీల్య నేత్రే స్థితః;
కాన్తా కుట్మలితాననేన దధతీ
వాయుం స్థితా తత్ర సా,
భ్రాన్త్యా ధూర్తతయా తదా నతి మృతే
తే నాభవ చ్చుమ్బితా.                                ౮౦

అన్య వనితా నిశ్శఙ్క దష్ట అధరః ప్రేయాన్=పర కామినిచేత తనివితీర కొఱుకఁబడిన మోవికలవాఁడయిన ప్రియతముఁడు, లీలా తామరస ఆహతః (సన్) (నిజకాంతచే) (వేడుకకై చేతనుంచుకొనఁబడిన) తామరచేత కొట్టఁబడినవాఁడై, కేసర దూషిత ఈక్షణ ఇవ నేత్రేవ్యామీల్య స్థితః=అకరువుచేత బాధింపఁబడిన కన్నులుగలవాఁడుం బోలె కన్నులను మూసికొని యుండెను, తత్ర=అంతట, కాన్తా భ్రాన్త్యా కుట్మలిత ఆననేన వాయుం ధమతీ స్థితా=ఆస్వకాంత (తాను వైచినతామరయొక్క కింజల్కము అతని కన్నులలో పడిన దనెడు) భ్రమచేత ముడువఁబడిన నోటితో నోరు ముడుచుకొని (అతని కన్నులమీఁద) గాలిని ఊదుచు ఉండినది, తదా తేన ధూర్తతయా నతిమ్ ఋతే చుమ్బితా అభవత్ = అప్పుడు అతని చేత మోసగానితనముచే (మోసముగా) నమస్కారము లేకయె (తన యపరాధమును మన్నింపు మని తా నామెపాదములవ్రాలి ప్రార్థింపకయే) ముద్దుగొనఁబడినది ఆయెను.

అన్యవనితచే తనివితీర కఱవఁబడిన మోవిగలవానిని నాయిక లీలా తామరసముతోఁ గొట్టినది. అంత నాతఁడు దాని కింజల్కములు కన్నులలోఁ బడినట్లు నటించుచు కన్నులు మూసికొని యుండెను. అంత నామె ఆ ట

క్కుడుఁగక నిజముగానే కన్నులలో కింజల్కములు పడిన వని తలంచి నోటిని ముడుఁచుకొని అతని కన్నులలోనికి ఊర్పును ఊఁదసాగినది. ఆ సమయములో అతఁడు నిజాపరాధక్షాంతికై ఆమెపాదములం బడక తప్పిం చుకొన్నవాఁడై తటాలున టక్కుగా ఆమె నెమ్మోమును ముద్దుగొనియెను.

అవ॥ లీ లేతి॥అన్యవనితా నిశ్శఙ్కదష్టాధరః - అన్యవనితయా సపత్న్యా - నిశ్శఙ్కం స్వైరం యథా తథా - దష్టః దన్తైః క్షతః-అధరో రదనచ్ఛదః-యస్య స తథోక్తః - ప్రేయాన్ ప్రియతమః - లీలాతామరసాహతః నాయికయా లీలాకమల తాడత స్సన్ - కేసరదూషితేక్షణ ఇవ కిఞ్జల్కకలిత దృష్టి రివ - నేత్రే - వ్యామీల్య ముకుళీకృత్య - స్థిత స్తత్ర తస్మి న్నవసరే- సా కాన్తా రమణీ - భ్రాన్త్యా నయనయోః కిఞ్జల్క పాతభ్రమేణ హేతునా - కుట్మలితాననేన సంకుచితముఖేన - వాయుం దధతి యచ్ఛన్తీ ముఖ ఫూత్కారం వమ న్తీ త్యర్థః - స్థితా తస్థౌ - తదానీం - ధూర్తతయా వఞ్చకతయా - తేన నాయకేన - నతి మృతే ప్రణామం వినా - చుమ్బితా కృతచుమ్బనా అభవ దితి సంబన్ధః. స్పష్ట ఏ వాభిప్రాయః. నాయికా స్వీయా, మధ్యా చ. నాయకో ధృష్టః. ప్రత్యక్షదృష్టస్వాపరాధకుపితాం నాయికాం కిఞ్జల్కపాత వ్యాజేన వఞ్చయిత్వా రసాన్తర సంజ్ఞే నోపాయేన సమాహితవాన్ - యథోక్తం దశరూపకే -

'సామ్నా భేదేన దానేన నత్యుపేక్షారసాన్తరైః
ఏభి ష్షడ్భి రుపాయై స్తు కుర్యా న్మానాపనోదనమ్.
రభసత్రాసహర్షాద్యైః కోపభ్రంశో రసాన్తరైః.' ఇతి.

జాతి రలంకారః. ౮౦

---

పురాఽభూ దస్మాకం ప్రథమ మవిభిన్నా తను రియం,
తతోఽనుత్వం ప్రేయాన్, వయ మపి హతాశాః ప్రియతమాః,

ఇదానీం నాథ స్త్వం, వయ మపి కళత్రం. కిమపరం
హతానాం ప్రాణానాం కులిశకఠినానాం ఫల మిదమ్. ౮౧

నాయకుని నాయిక తనపై యతని ప్రేమ తగ్గినందులకు దూరుట. — పురా అస్మాకం ప్రథమమ్ ఇయం తనుః అవిభిన్నా అభూత్ = పూర్వకాలమున మనకు మొదట ఈదేహము భేదములేనిదిగా నుండెను, తతః అను త్వం ప్రేయాన్ హత ఆశాః వయమ్ అపి ప్రియతమాః = అటు తర్వాత నీవు ప్రియుతముఁడవును పాడైన కోరికగలవారము (దానను) మేమును (నేనును) ప్రేయసులము (ప్రేయసిని) అయితిమి. ఇదానీం త్వం నాథః వయమ్ అపి కళత్రమ్ = ఇప్పుడు నీవు భర్తవు మేమును (నేనును) భార్యను, అపరంకిమ్=ఇఁక వేఱే మున్నది, ఇదం కులిశ కఠినానాం హతానాం ప్రాణానాం ఫలమ్=ఇది వజ్రాయుధమువలె గట్టివైన పాడు ప్రాణములకు ప్రయోజనము.

తొలుత మన కిరువురకు అభేదభావము ఉండినది, తర్వాత ప్రేయసీప్రియతమభావము కలిగినది. ఇప్పుడు భార్యాభర్తృభావము దాఁపరించినది, నీప్రేమ యిట్లు క్షీణించుచుండఁగా నాకు బ్రతుకునకన్న చావు మేలు; అని భా.

అన॥ నాయికా హీయమాన ప్రేమాణం నాయక ముపాలభతే - పు రేతి॥ పురా పూర్వకాలే - అస్మాక మావయోః - సూ॥ 'అస్మదో ద్వయో శ్చ' ఇతి బహువచనం - ప్రథమ మాదితః - ఇయం - తను శ్శరీరమ్- అవిభిన్నా భేదశూన్యా - అభూ - త్తత - స్తస్మా-త్కాలా - దన॥ ని॥ 'పశ్చాత్సాదృశ్యయో రను' ఇ త్యమరః-త్వం - ప్రేయాన్ ప్రియతమః - హతాశాః నష్టాతితృష్ణాః-భాగ్యహీనా ఇ త్యర్థః ॥ని॥ 'ఆశా తృష్ణాతిశాయితా' ఇ త్యమరః. వయ మపి - ప్రియతమాః ప్రేయస్యః - అత్ర వయమితి బహువచనం నిర్వేదాత్ - ఏవం నిర్వేదాదిషు కవిభి బర్హువచనం ప్రయుజ్యతే - తథా చోక్తం శాకున్తలె-'వయం తత్త్వాన్వేషా న్మధుకర

హతా స్త్వం ఖలు కృతీ,' ఇతి-ఇదానీ మధునా - త్వం నాథః వయ మపి-శకత్రం భార్యా - అపర మన్య - త్కిం కళత్రభావా ద్దినం దశా న్తరం కి మపి నా స్తీ త్యర్థః - ఇద మేత త్ప్రియహీన సహిష్ణుత్వం - హతా నా మభాగ్యానాం - కులిశకఠినానాం వజ్రకఠోరాణాం - ప్రాణా నా మసూనాం - ఫలం ప్రయోజన - మితి సంబన్ధః - అత్ర కేచి చ్ఛ్లోకస్య ప్రథమపాదె వాక్యద్వయం ప్రతిపాదయ న్తి 'అస్మాకం పురాఽభూది' త్యేకం, తత్ప క్షే కిమ ప్య నిర్వాచ్య రసా న్తర మి త్యధ్యాహార్యమ్. అత్ర నిర్వేదో నామ సఞ్చారి భావః. ప్రేమార్ద్రతారసశ్చ. నాయికా స్వీయా ప్రగల్భా చ. నాయక శ్శఠః. సోపాలమ్భవచనం నర్మ. జాతి రలంకారః. ౪౧

---

ముగ్ధే ముగ్ధత యైవ నేతు మఖిలం
కాలం కి మారభ్యతే ?
మానం ధత్స్వ, ధృతిం బధాన, ఋజుతాం
దూరే కురు ప్రేయసి;
స ఖ్యై వం ప్రతిబోధితా ప్రతివచ
స్తా మాహ భీతాననా
నీచై శ్శంస హృది స్థితో హి నను మే
ప్రాణేశ్వర శ్శ్రో ష్యతి. ౪౨

ముగ్ధే ముగ్ధతయా ఏవ అఖిలం కాలం నేతుమ్ ఆరభ్యతే కిమ్ = (ఓ) ముద్దరాలా గోలతనమున నే ఎల్ల కాలమును గడపుటకు (ప్ర. వ్య.) కడంగెదవా ఏమి, ప్రేయసి మానం ధత్స్వ = ప్రియతమునియందు కోపము వహింపుము, ధృతిం బధాన = ధైర్యమును పూనుము, ఋజుతాం దూరే కురు=తిన్నఁదనమును దూరమునకు నెట్టుము, ఏవం సఖ్యా ప్రతి

బోధితా భీత ఆననా (సతీ) = ఈప్రకారము చెలిచే నేర్పఁబడినదై భయ
పడిన మోముగలదియై (నాయిక), నను నీచైః శంస హి మే హృది స్థితః
ప్రాణేశ్వరః శ్రోష్యతి (ఇతి) తామ్ ప్రతివచః ఆహ = ఓసి మెల్లగా
చెప్పుము ఏలయనఁగా నా హృదయమందు ఉన్నట్టి ప్రాణనాయకుఁడు
వినఁగలఁడు (అని) ఆచెలికి బదులుమాటను చెప్పెను.

(ఓ) ముద్దరాలా ఎల్లకాలము ఇట్లే ఏమియు దెలియని దానవుగా
నుండెదవా? ప్రియతమునిమీఁద అలుగుము, తెగువను పూనుము, ఈతిన్నఁ
దనమును మానుము, (అట్లు చేసిన నీమీఁద నతనికి ప్రేమ యధికమగును)
అని చెలి నేర్పఁగా నాయిక 'మెల్లగా చెప్పుము, నామనస్సులో నతఁ
డున్నాఁడు, అతనికి వినఁబడును,' అని బదులుచెప్పినది. అలుక దాల్చుటకు
నాయికకు మన స్సొప్ప దాయె ననుట.

అవ ॥ కవే ర్వాక్యమ్ - ముగ్ధ ఇతి॥ హే - ముగ్ధే బాలే - ముగ్ధత
యైవ మూఢత్వేనైవ - అఖిలం సమస్తం - కాల మనేహాసం- నేతు మతి
వాహయితుం - కిమర్థ మారభ్యతే కిమర్థ ముద్యోగః క్రియతే -
అన్యథా కిం కర్తవ్య మితి పృచ్ఛసి చేత్ బ్రవీమి - ప్రేయసి ప్రియతమే-
మానం కోపం - ధత్స్వ ధారయ- ధృతిం ధైర్యం - బధాన సహస్వ అవ
లమ్బ స్వేత్యర్థః - ఋజుతా మార్జవం - దూరే విప్రకృష్టే - కురు
విధేహి - వక్రతాం భజ స్వే త్యర్థః - సా - ఏవ మనేన ప్రకారేణ -
సఖ్యా వయస్యయా - ప్రతిబోధితా ఉపదిష్టా - భూత్వా - భీతాననా
త్రస్తముఖీ సతీ - తాం సఖీం - ప్రతి వచః ఉత్తర - మాహ బ్రవీతిస్మ -
కిమివ-నను హే - సఖి-నీచై రల్పధ్వని ర్యథాభవతి తథా-శంస కథయ-
హి యస్మా త్కారణా-త్తే మమ - హృదయే స్థితః ప్రాణేశ్వరః - శ్రోష్య
త్యాకర్ణయిష్య - తీతి సంబన్ధః. స్పష్ట ఏ వాభిప్రాయః. అత్ర భయం
నామ సఞ్చారీ భావః. స్థాయిభావానా మపి క్వచి త్సఞ్చారిభావత్వ కథ
నాత్. నాయికా స్వీయా ముగ్ధా చ. నాయక శ్శఠః. అత్ర సభయం
శృఙ్గారి. నర్మ. ఆక్షేపోఽలంకారః. ౭౨

ఆల మ్బ్యఙ్గణవాపికాపరిసరె చూతద్రుమె మఞ్జరీం
సర్ప త్సాన్ద్రపరాగ లమ్పట రణ ద్భృఙ్గాఙ్గనా శోభినీం
మన్యే స్వాం తను ముత్తరీయశకలె నాచ్ఛాద్య బాలా స్ఫుర
త్కణ్ఠధ్వాననిరోధ కమ్పితకుచ శ్వాసోద్గమా రోదితి. రా3

ప్రోషితుఁడు వసంతకాలమున తననాయికయవస్థను ఊహించి చెప్పుచున్నాఁడు.—బాలా = (నా) ముగుద, అఙ్గణ వాపికా పరిసరే చూతద్రుమె=ముంగిటి బావి చెంత మామిడి చెట్టునందు, సర్పత్ సాన్ద్ర పరాగ లమ్పట రణత్ భృఙ్గ అఙ్గనాశోభినీమ్ మఞ్జరీమ్ ఆలమ్బ్య = వ్యాపించుచున్న దట్టమయిన పుప్పొడియందు ఆసక్తములై ఝుంకరించుచున్న తుమ్మెద కొమరాండ్రచేత విరాజిల్లుచున్న పూరెమ్మను పట్టుకొని, స్వాం తనుమ్ ఉత్తరీయ శకలేన ఆచ్ఛాద్య = తన దేహమును పయ్యెద చెఱఁగుచేత కప్పుకొని, స్ఫురత్ కణ్ఠ ధ్వాన నిరోధ కమ్పిత కుచ శ్వాస ఉద్గమా (సతీ) రోదితి (ఇతి) మన్యే = స్పష్టపడుచున్న గొంతుకయొక్క ఎలుఁగుయొక్క ఆఁపుటచేత అదరిన చన్నులును నిట్టూర్పుల వెలువడుటయును గలదై ఏడ్చుచున్నది అని తలంచుచున్నాను.

మంజరిని పట్టుకొనుట అది తన ప్రాణమును హరించుఁగాక యని; తనువును కప్పుకొనుట ఇతరులకు తన ఱయిదము గోచరము కాక యుండుటకు; ఎలుంగును నిరోధించుట ఇతరులకు వినఁబడకుండుటకు; రోదనము నేను రామికి; కంపనము జవరాలుగావున.

అవ ॥ ప్రోషితో నాయకః వసన్తసమాగమె ప్రియాయా అవస్థాన్తరం వితర్కయన్నాహ - ఆలమ్బ్యేతి ॥ అఙ్గణవాపికా పరిసరే చత్వరదీర్ఘికా ప్రాన్తే-చూతద్రుమే - సర్పత్సాన్ద్రపరాగలమ్పటరణద్భృఙ్గాఙ్గనా శోభినీం - సర్పన్ విసరన్-సాన్ద్రో నిబిడః - పరాగః పుష్పరేణుః - తస్మిన్ - లమ్పటా ఆసక్తాః - రణన్త్యః - స్వనన్త్యః - భృఙ్గాఙ్గనాః భ్రమర్యః - తాభి శ్శోభత - ఇతి భృఙ్గాఙ్గనా శోభినీం - మఞ్జరీం వల్లరీ-

మాలమ్బ్య గృహీత్వా - బాలా తను ముత్తరీయశకలే - నాచ్ఛాద్య అవగుణ్ఠ్య - స్ఫురత్కణ్ఠధ్వాన నిరోధకమ్పితకుచ శ్వాసోద్గమా - స్ఫురత్ప్రిముభర్ణవ - త్కణ్ఠధ్వానః కణ్ఠధ్వనిః - తస్య - నిరోధః నివారణం - తేన కమ్పితౌ కుచౌ చ శ్వాసోద్గమ శ్చ యస్యా స్సా తథోక్తా - రోదితి రోదనం కరో తీతి - మన్యే స్మరామీతి సంబన్ధః. దైన్యం నామ సఞ్చారీ భావః. నాయికా స్వీయా మధ్యా చ, కించ ప్రోషిత భర్తృకా. నాయకోఽనుకూలః. ప్రవాస విప్రలమ్భ శృఙ్గారః. ౮3

---

అనాలోచ్య ప్రేమ్ణః పరిణతి, మనాదృత్య సుహృద,
స్త్వయా కాఙ్క్షే మానః కి మితి తరళే సంప్రతి కృతః?
సమాకృష్టా హ్యేతే ప్రళయదహనోద్భాసురశిఖాః
స్వహస్తేనాఽఙ్గారా, స్త దల మధునాఽరణ్యరుదితైః. ౮౪

నాయికను తత్సఖి నాయకపక్షమున మందలించుచున్నది.—(హే) తరళే ప్రేమ్ణః పరిణతిమ్ అనాలోచ్య = ఓచపలురాలా (ప్రియుని) యనురాగముయొక్క పరిపాకమును తలపోయక, సుహృదః అనాదృత్య=చెలులను సరకుగొనక, సంప్రతి త్వయా ఆకాఙ్క్షే కిమ్ ఇతి మానః కృతః (ప్ర. వ్య.) ఇప్పుడు నీవు అనవసరమును ఎందుల కని (అతనిపై) కోపము దాల్చితివి, ప్రళయ దహన ఉద్భాసుర శిఖాః అఙ్గారాః స్వహస్తేన సమాకృష్టాః హి = క్షయకాలపు నిప్పుయొక్క పైకిమండుచున్న జ్వాలలుగలవైన (యీ) నిప్పుకలను నీ చేతనే (నీపైకి) లాగికొంటివి గావున, అధునా అరణ్య రుదితైః అలమ్=ఇపుడు అడవి యేడ్పులు మానుము. అడవి యేడ్పనఁగా రక్షకులు లేనిచోట మొఱపెట్టుకొనుట, నిష్ప్రయోజన మయిన యేడ్పన్నమాట.

ఆతని ప్రేమయడి ఎట్లు మాఱునో అని ఆలోచింపక, చెలులమాటలు సరకుసేయక, నీవు ఆసమయమున ఆతనిపై అలుక దాల్చితివి. అతఁడును

అలిగిపోవుటయే అందులకు ఫలముగా సంభవించినది. కాన నీవు చేసినపని ప్రళయాగ్నిజ్వాలాజటాలంబు లయిన నిప్పుకలను దెచ్చి మీఁద వైచికొనుట యాయినది. కార్యము మించినపిమ్మట ఇప్పుడు ఏల వృథాగా ఏడ్చెదవు, ఊరకుండుము.—అనుట.

అవ॥ అపరాధినా నాయకేన ఖేదం ప్రాపితా సఖీ నాయికా మపాలభతే-అనాలోచ్యేతి॥ ప్రేమ్ణః అనురాగస్య-తదీయ స్యేతి శేషః-పరిణతిం పరిపాకమ్-అనాలోచ్య-అవిచార్య-సుహృద స్సఖీ-ర నాదృత్య అవధీర్య - తాసాం వచనముల్లఙ్ఘ్యే త్యర్థః-హే - తరళే చపలే- సంప్రతి ఇదానీ-మకాణ్డే అనవసరే-కిమితి కిమర్థం-మానః కోపః - కృతః విరచితః-ప్రియం ప్రతీతి శేషః - హి యస్మా త్కారణాత్ - ప్రళయదహనోద్భాసురశిఖాః-ప్రళయః కల్పాన్తః-తస్మిన్-దహనో వహ్నిః-తేన-ఉద్భాసురాః-ప్రదీప్తాః-శిఖాః జ్వాలా యేషాం తే తథోక్తాః-అఙ్గారా ఉల్కాః-ఏతె ఇమే - స్వహస్తే నాత్మకరేణ - సమాకృష్టాః సమాక్షిప్తాః-స్వ స్యోపరి అవకీర్ణాః - ఇత్యర్థః - త త్తస్మా త్కారణాత్ - అధునా సంప్రతి - అరణ్యారుదితైః కృతధారోదనైః-రలం పర్యాప్త-మితి సంబన్ధః. అత్ర 'స్వహస్తేన అఙ్గారా స్సమాకృష్టా' ఇత్యనేన భవత్యా జ్ఞాత్వైవ అనర్థః కృత ఇతి సూచితమ్, 'అరణ్యారుదితై' రిత్యనేన ప్రియ స్యాసన్నిధానే రుదితా త్కిం ఫలం లభ్యత ఇత్యయమర్థోఽవగమ్యతే. దైన్యం నామ సఞ్చారీ భావః. నాయికా స్వీయా మధ్యా చ, కిం చ కలహాన్తరితా. నాయక శ్శఠః. మానకృతో విప్రలమ్భ శృఙ్గారః. అత్ర సోపాలమ్భవచనం నర్మ. ఆక్షేపో ఽలంకారః. ౭౪

---

కపోలే పత్త్రాళీ కరతలనిరోధేన మృదితా,
నిపీతో నిశ్శ్వాసై రయ మమృతహృద్యోఽధరరసః,

**ముహుః కణ్ఠే లగ్న స్తరళయతి బాష్ప స్స్తనతటం,**
**ప్రియో మన్యు ర్జాత స్తవ నిరనురోధే న తు వయమ్.**

నాయకుఁడు నాయికను నిందించుట.—కపోలే పత్త్ర ఆళీ కరతల నిరోధేన మృదితా=చెక్కున మకరికల పంక్తి అఱచేతి యడ్డుటచేత (అఱచేత చెక్కిలి చేర్చి యుండుటచేత) చెఱుపఁబడినది (చెడిపోయినది), అమృత హృద్యః అయమ్ అధర రసః నిశ్వాసైః నిపీతః = అమృతమువలె మనోహరమయిన యీ మోవి ద్రవము నిట్టూర్పులచే త్రాగఁబడినది (ఇగిరి పోయినది), కణ్ఠే లగ్నః (సః) బాష్పః స్తన తటం ముహుః తరళయతి= గొంతులో తగుల్కొన్నదై కన్నీరు చను దరిని మాటికిని వడఁకించుచున్నది, నిరనురోధే = అనునయము నొల్లనిదానా, తవ మన్యుః ప్రియః జాతః వయం తు న, నీకు కోపము ఇష్టము అయినది మేమో కామైతివి.

చెక్కును అఱకేలం జేర్చుకొన్నందున చెక్కునం గలమకరికాపత్త్రములు మాసిపోయినవి, నిట్టూర్పులవేఁడికి అమృతోపమ మయిన యధర ద్రవము ఇగిరిపోయినది, కంఠమున అంపబడిన బాష్పములచేత మాటిమాటికిని చను గట్లు అదరుచున్నవి, మే మెంత బతిమాలినను, వినక యిట్లు వందురుట సరిగాదు.— అనుట.

అవ॥ నాయకో నాయికా ముపాలభతే - కపోల ఇతి ॥ కపోలే గణ్డస్థలే - పత్త్రాళీ పత్త్రరచనా - కరతల నిరోధేన పాణితలనిపీడనేన - మృదితా ప్రమృష్టా-నిశ్వాసై -రమృతహృద్యః అమృతవన్మధురః-అయ మధర రసః-నిపీతః ఆస్వాదితః-బాష్పః అశ్రు కణ్ఠే,లగ్న స్సక్త స్సన్ - స్తనతటం స్తనప్రాన్తం-ముహుః పునఃపునః-తరళయతి-ఏవ మనేన ప్రకారేణ-మన్యుః కోపః-స్తవ-ప్రియో హితో-జాతః-హే-నిరనురోధే అనఙ్గీకృతానువర్తనే-వయం తు ప్రియాహితా న భవామ ఇతి సంబన్ధః. అత్ర పత్త్రాళీమర్దనాది వ్యాపారేణ 'సౌభాగ్యహారీ మన్యు స్తవ హితో జాత' ఇత్యనేన చ 'త్వ దనువర్తనకారిణో వయం తు తవ హితా న భవామ' ఇత్యనేన చ ఉపా

లమ్భో గమ్యతే.—నాయికా స్వీయా మధ్యా చ. నాయక శ్శఠః. మానకృశో విప్రలమ్భవచనం నర్మ. ఆక్షేపో ఽలంకారః. రా౫

---

ఆయాతే దయితే, మనోరథశతైః నీత్వా కథంచి ద్దినం,
గత్వా వాసగృహం, జడే పరిజనే దీర్ఘాం కథాం కుర్వతి,
దష్టాఽస్మీ త్యభిధాయ సత్వరపదం వ్యాధూయ చీనామ్బరం
తన్వఙ్గ్యా రతికాతరేణ మనసా నీతః ప్రదీప శ్శమమ్. రాఽ

దయితే ఆయాతే సతి = ప్రియుఁడు (విదేశమునుండి) రాఁగా, మనోరథ శతైః కథం చిత్ దినం నీత్వా = కోర్కుల నూర్లచేత ఎట్టకేలకు పగటిని కడపి, (అనంతరము), వాస గృహం గత్వా = పడకటిల్లు చొచ్చి (ప్రయోగ వ్యత్యయము.)—తన్వఙ్గ్యా = సుందరి, జడే పరిజనే దీర్ఘాం కథాం కుర్వతి (సతి) = మూఢమయిన పరివారజనము చిరమయిన సల్లాపమును చేయుచుండఁగా, రతి కాతరేణ మనసా = సురతముకై తహతహపడుచున్న మనస్సుతోఁ గూడుకొన్నదై, దష్టా అస్మి ఇతి అభిధాయ = ఏదో కఱచినది నన్ను అని పలికి, స త్వర పదం చీన అమ్బరం వ్యాధూయ = వేగిరపాటుతోఁ గూడిన యడుగులు గలుగునట్లుగా (వడివడిగా తొట్రుపాటుతో అడుగులిడుచు) (తన కట్టుడు) పట్టు వలిపమును వీచి, ప్రదీపః శమం నీతః = దీపమును శమము పొందించినది (ఆర్పివైచినది.)

కాంతుఁడు ప్రవాసమునుండి రాఁగా కాంత ఈ యీవిధముల రాత్రి సురతక్రీడలం దేలుదును గాక యను తలపోఁతలతో పగ లెల్లఁ గడపి రాత్రి పడక టిల్లు సొచ్చినంతట మూర్ఖపరిజనులు నాయకుని నానా విధసమాచారము లడుగుచు ఎంతసేపటికిని వదలక యుండఁగా రతికై యువ్విళ్లూరుచున్నదై తన్ను ఏదో కుట్టిన దని పలికి తత్తఱపుటడుగు లిడి చీరచెఱంగు జాడించి దీపమును ఆర్పి వారిని తొలంగించుకొన్నది.—అనుట.

అవ॥ కవే ర్వాక్యమ్ - ఆయాత ఇతి॥ దయితె ప్రియె - ఆయాతె ఆగతే సతి - దేశాన్తరా దితి శేషః - మనోరథశతై - మనోరథానాం సఙ్కల్పానాం - శతాని బహూని - తై - దినం దివసం - కథంచి త్కృచ్ఛ్రేణ - నీత్వా అతివాహ్య - వాసగృహం కేళీభవనం - గత్వా ప్రాప్య - జడే వివేకశూన్యే - పరిజనె పరిచారకవర్గే - దీర్ఘా మాయతాం - కథాం వాక్యప్రబన్ధం - కుర్వతి విదధతి సతి-రతికాతరేణ రతౌ విషయే - కాతర మధీరం-తేన కాలవిలమ్బనాసహిష్ణు నేత్యర్థః - మనసా హృదయేన - ఉపలక్షితయా - తన్వఙ్గ్యా కాన్తయా-దష్టా స్మీతి యేన కే నాపిజన్తు నేతి శేషః - సత్వరపదం ససంభ్రమవచనం - యథా భవతి తథా అభిధాయ వ్యాహృత్య-చీనాంశుకం క్షౌమవసనం-వ్యాధూయ సంవీజ్య - ప్రదీపో దీపః-శమం శాన్తిం - నీతః ప్రాపిత ఇతి సంబన్ధః. అభి ప్రాయో వ్యక్త ఏవ. ఔత్సుక్యం నామ సంచారీ భావః. నాయికా స్వీ యా ప్రగల్భా చ. నాయకోఽనుకూలః. ప్రవాసాన న్తర సమ్భోగ శృఙ్గారః. అత్ర నర్మగర్భః యుక్తి రలంకారః. ౭౬

---

రోహన్తౌ ప్రథమం మమోరసి తవ ప్రాప్తౌ వివృద్ధిం స్తనౌ,
సల్లాపా స్తవ వాక్యభఙ్గిమిళనా న్మౌగ్ధ్యం పరం త్యాజితాః,
ధాత్రీకణ్ఠ మపాస్య బాహులతికే కణ్ఠే త వాసజ్జితే,
నిర్దాక్షిణ్య కరోమి కిన్ను విశిఖాఽప్యేషా న పన్థా స్తవ.౭౭

తొలుత ననురక్తుఁడై పిమ్మట వదలిన నాయకుని సామాన్యనాయిక దెప్పర మాడుట.— స్తనౌ ప్రథమం మమ ఉరసి రోహన్తౌ (సన్తౌ) తవ (ఉరసి) వృద్ధిం ప్రాప్తౌ=(నా) స్తనములు తొలుత నాఱొమ్మున మొలచుచు (అనంతరము) నీఱొమ్మున పెంపును పొందినవి, సల్లాపాః తవ వాక్య భఙ్గి మిళనాత్ పరం మౌగ్ధ్యం త్యాజితాః=(నా) మాటలు నీ మాటల రీతితోడి

కూడికచేత మిక్కిలి గోలతనమును వదలునట్లు చేయఁబడినవి, బాహులతికే ధాత్రీ కణ్ఠమ్ అపాస్య తవ కణ్ఠే ఆసజ్జితే = (నా) భుజ వల్లులు దాది మెడను వదలి నీ మెడయందు అంటింపఁబడినవి, (హే) నిర్దాక్షిణ్య = (ఓయి) మొగమోటము లేనివాఁడా, ఏషా విశిఖా తవ పన్థా అపి న = ఈ రాజమార్గము నీకు (ఇపుడు) దారి యేనియు కాదు, కిం కరోమి = నేను ఏమి చేయుదును!

నేను నాబాల్యమునుండియే నిన్ను అత్యంతము వలచితిని, స్తనములు పొటమరింపఁ దొడంగినప్పటినుండి నీఱొమ్మునసే యుంటిని, నీతోడి యుక్తిప్రత్యుక్తులచే మాటలబేలతనమును తలంగితిని, దాది మెడనున్న నా బాహువులను తివిచి నీ మెడయం దుంచితిని. నీవు ఆ యనురక్తి యెల్లను మఱచి యిపుడు ఈదారిని పోవుట సయితము మానితివి. నా యదృష్ట మట్టిది, నే నేమి సేయుదును! —అనుట.

'రోహన్తౌ' అను శతృప్రత్యయస్వారస్యము మొలచియు మొలవక ముందే అనుట; 'నీఱొమ్మునం బెరిఁగినవి' అనుటచే నాకు జవ్వనము నిండు వఱకు నీకును ఆవలపు ఉండె నని భా. 'దాది మెడనుండి' యనుటచే అతి బాల్యమునుండి యనియు, అన్యపురుషుని ఎఱుంగనితఱి ననియు భా. 'న పన్థాః' ఇత్యాదిచే ఒకమాఱు విజయంచేసి యనుగ్రహింపుము, అనుట.

అవ ॥ పూర్వం కృతపరిచయాతిశయేన నాయకేన పశ్చాత్పరిత్యక్తా నాయికా స్వవాటికాయాం యదృచ్ఛాగతం నాయకం దృష్ట్వా త ముపాలభతే - రోహన్తా వితి ॥ ప్రథమం మమోరసి - రోహన్తౌ వుద్భవన్తౌ - స్తనౌ త వోరసి వృద్ధిం - ప్రాప్తౌ గతౌ-మమ - సల్లాపా స్సంభాషణాని- తవ - వాక్యభఙ్గిమిళనాత్ వాక్యరీతి శ్రవణాత్-పర మత్యర్థం - మౌగ్ధ్యం మూఢతాం - త్యాజితాః విమోచితాః - మమ బాహులతికే - ధాత్రీకణ్ఠం ఉపమాతృకణ్ఠ - మపాస్య విహాయ - తవ కణ్ఠే - ఆసజ్జితే ఆసఙ్గం ప్రాపి తే - హే - నిర్దాక్షిణ్య దాక్షిణ్యరహిత-దాక్షిణ్యం నామ పరచిత్తాను

వర్తనం - ఏషా విశిఖా రథ్యాపి - తవ - పన్థా మార్గః - న భవతి - ఏవం సతి-కి న్ను కరోమి కిం కర్తవ్యం ను పృచ్ఛామి, భవ న్తం కి ముపాలభ ఇ త్యర్థః. అత్ర నాయికా సాధారణీ. సోపాలమ్భవచనం నర్మ. ఆక్షేపాఽలంకారః. ౮౭

---

చక్షుఃప్రీత్యా నిషణ్ణే మనసి, పరిచయా
చ్చిన్త్యమానేఽభ్యుపాయే,
యాతే రాగే వివృద్ధిం, ప్రవిసరతి గిరాం
విస్తరే దూతికాయాః,
ఆస్తాం దూరే స తావ త్సరభసదయితా
లిఙ్గనానన్ద లాభ,
స్తద్గేహోపాన్తరథ్యాభ్రమణ మపి పరాం
నిర్వృతిం సంతనోతి. ౮౮

చక్షుః ప్రీత్యా మనసి నిషణ్ణే (సతి) = చూపు మక్కువచేతను మనస్సు తగులుకొన్నది (కాఁగా), పరిచయాత్ అభ్యుపాయే చిన్త్యమానే (సతి) = మాటికిం దలపోయుటవలన కూడికకు ఉపాయము ఆలోచింపఁ బడుచుండఁగా, రాగే వివృద్ధిం యాతే (సతి) = అనురాగము పెంపును పొందినది (కాఁగా), దూతికాయాః గిరాం విస్తరే ప్రవిసరతి (సతి) = కుంటెనకత్తెయొక్క మాటల సమూహము వ్యాపించుచుండఁగా, సరభస దయితా ఆలిఙ్గన ఆనన్ద లాభః యః సః తావత్ దూరే ఆస్తామ్=హర్షము తోడి ప్రియురాలియొక్క కౌఁగిలింతచేతి యాహ్లాద ప్రాప్తి ఏదో అది దూరమున నుండుఁగాక (దానిమాట అటుండనీ), తత్ గేహ ఉపాన్త రథ్యా భ్రమణమ్ అపి పరాం నిర్వృతిం సంతనోతి = ఆకాంతయొక్క యింటి చెంగటి పెద్దవీథిలో సంచారము సయితము మిక్కుటమైన యానందమును కలిగించుచున్నది.

చక్షుఃప్రీతి, మనస్సక్తి, ఉపాయాన్వేషణము, రాగవృద్ధియు, సంపన్నములై, దూత్యము జరుగుచుండఁగా, ఆకాంతయొక్క పొందే కలిగినంతట ఆయానందమెట్టిదో చెప్ప నలవి గాదు సరియే కదా, తద్గృహసంగతరథ్యాసంచారము సయితము మిక్కుటమైన యానందమును కలుగఁజేయుచున్నది.— అనుట.

అవ ॥ నాయకః అనుభూతార్థస్మరణా జ్జాతకుతూహల స్స్వసహచర మాహ - చక్షు రితి ॥ చక్షుః ప్రీత్యా - మనసి చిత్తే - నిషణ్ణే సతి నివిష్టే సతి ఆసక్తే సతీ త్యర్థః - పరిచయా దభ్యాసా న్మహుర్ముహు స్సఙ్గా దిత్యర్థః- అభ్యాసే ప్రాప్త్యుపాయే - చిన్త్యమానే సతి విచార్యమాణే సతి - తతః - రాగే ప్రేమ్ణి - వివృద్ధి మతిశయం - ప్రాప్తే సతి తతో - దూతికాయా స్సఞ్చారికాయాః _ గిరాం వాచాం - విస్తరే ప్రపఞ్చే - ప్రవిసరతి వ్యాపియమానే సతి - యః _ సరభసదయితాలిఙ్గనానన్ద లాభః సత్వరప్రియాపరిరమ్భాహ్లాదప్రాప్తి - భవతి స తావ ద్దూరే_ ఆస్తాం తిష్ఠతు _ తస్య మహిమా వర్ణయితు మశక్య ఇత్యర్థః_కిం తు - తద్గేహోపాన్త రథ్యాభ్రమణ మపి నాయికా గృహసమీపవీథీపర్యటన మపి-పరాం నివృతిమ్ అత్యన్త మానన్దం - సంతనోతి విదధా - తీతి సంబన్ధః. అత్ర స్మృతి ర్నామ సఞ్చారీ భావః నాయికా పరకీయా. ఆక్షేప రూపం శృఙ్గారి నర్మ. అతిశయోక్తి రలంకారః. ౮౮

---

కరకిసలయం ధూత్వా ధూత్వా విలమ్బిత మేఖలా
క్షిపతి సుమనోమాలాశేషం ప్రదీపశిఖాం ప్రతి,
స్థగయతి ముహుః పత్యు ర్నేత్రే విహస్య సమాకులా
సురతవిరతౌ, రమ్యా తన్వీ పునః పున రీక్ష్యతే. ౮౯

రతాంతనగ్న నాయికాలజ్జాకార్యవర్ణనము.—సురత విరతౌ తన్వీ విలమ్బిత మేఖలా సమాకులా (సతీ) = సంభోగాంతమున నాయిక (పాద

ములకు) తగులుకొన్న మొలనూలుగలదై తొట్రుపాటున, ప్రదీప శిఖాం ప్రతి కర కిసలయం ధూత్వా ధూత్వా సుమనో మాలా శేషం క్షిపతి=దీప జ్వాల మీఁదికి కేలుఁ జిగురును వీచి వీచి పూ దండయొక్క మిగత (భాగము) ను విసరివైచుచున్నది, విహస్య ముహుః పత్యుః నేత్రే స్థగయతి=నవ్వి సారెకు దయితుని కన్నులను మూయుచున్నది, రమ్యం పునః పునః ఈక్ష్యతే =మనోహరముగా మాటి మాటికిని (అతనిచే) చూడఁబడుచున్నది.

రతాంతమందు నగ్నయయి యున్న నాయికపాదములలో మొల నూలు తగలుకొని దయితుని కంటియెదుటనుండి చీరకట్టుకొనుటకై అవలికి పోనీయక యుండఁగా చీకాకు పడినదై, దీపము నార్పినచో తననగ్నత యతనికిం గానరాకుండు నని దీపమును చేతితో విసరి అది యాఱమిచే సుర తసమగ్ద నష్టావశిష్ట మయిన పూదండతునియను దీపముపై విసరినది. దానను అది యాఱమిచే అతనికన్నులు మూయందొడంగినది. అతఁడు ఆమె చేయి సడలినప్పుడెల్ల ఆరమణీయతను మరల మరలం గాచుచుండెను.—అనుట.

అవ॥ కవే ర్వాక్యమ్ - కిసలయ మితి॥ సురతవిరతౌ సంభో గాన్తే - విలమ్బిత మెఖలా లగ్నరశనా - పాదయో రితి శేషః - తన్వీ కాన్తా - సమాకులా సంభ్రాన్తా సతీ - దీపనిర్వాణార్థం - కరకిసలయం పాణిపల్లవం - ధూత్వాధూత్వా వ్యాధూయ వ్యాధూయ - విఫలయత్నా సతీ - దీప శిఖాం ప్రతి దీపజ్వాలా ముద్దిశ్య - సుమనో మాలాశేషం పుష్ప దామచ్ఛేదం - సంభోగపరిమర్దవిభిన్న శిష్టాంశ మి త్యర్థః - క్షిపతి ప్రేరయతి - విహస్య స్మితం కృత్వా - ముహుర్ముహుః పునఃపునః - పత్యు ర్నేత్రే - స్థగయతి ఆచ్ఛాదయతి - రమ్యం మనోరమం - యథా భవతి తథా పునఃపున - ర్ముహుర్ముహుః - ఈక్ష్యతే విలోక్యతే - ప్రియే ణేతి శేషః ఇతి సంబన్ధః. 'విలమ్బితమేఖలే' త్యనేన పురుషాయిత సమ్భో గాన్తే మేఖలాసందానితచరణత్వా దపసర్తుమశ క్తేతి సూచ్యతే, 'దీప శిఖాం ప్రతి మాలాం క్షిపతీ' త్యనేన 'పత్యు ర్నేత్రే స్థగయతీ' త్యనేన

చ ప్రియనిరీక్షణేన చ లజ్జావ్యాకులేతి సూచ్యతే. అత్రవ్రీడా నామ సఞ్చారీ భావః. నాయికా స్వీయా మధ్యా చ. నాయకో౾నుకూలః. చేష్టాకృతం హాస్యశృఙ్గారి నర్మ. జాతి రలంకారః. ౮౯

---

పరాచీ కోపేనస్ఫుటకపటనిద్రాముకుళితా
ప్రవిశ్యాఙ్గేనాఙ్గం ప్రణయిని పరీరమ్భచతురే
శనైర్నీవీబన్ధం స్పృశతి సభయవ్యాకులకరం
విధత్తే సఙ్కోచగ్లపిత మవలగ్నం వరతనుః. ౯౦

కోపేన పరాచీ స్ఫుట కపట నిద్రా ముకుళితా వర తనుః = అలుకచేత పెడమొగంబయి స్పష్టమయిన మోసపు నిదురచే (కన్నులు) మూసికొన్న (ఉత్తమశరీర) సుందరి, అఙ్గేన అఙ్గం ప్రవిశ్య = అవయముచే అవయవమందు ప్రవేశించి (ఒకయవయములోనికి ఇంకొకయవయవమును ముణిఁచి), పరీరమ్భ చతురే ప్రణయిని నీవీబన్ధం సభయవ్యాకులకరం శనైః స్పృశతి (సతి) = ఆలింగనమందు నిపుణుఁడయిన యనురక్తుఁడు పోఁకముడిని భయముచే వణఁకుచున్న చేయిగలుగునట్లుగా మెల్లన తాఁకుచుండఁగా, అవలగ్నం సంకోచ గ్లపితం విధత్తే = నడుమును అక్కుళించుటచేత సన్నగిల్లిన దానిని గాచేయుచున్నది.

నాయిక అలుకచే పెడమొగంబయి మునుఁచుకొని పరున్నదై నాయకుఁడు నీవిని వదలింపఁ జేయి యుంపఁగా సంభోగేచ్ఛగలదై కడుపును అక్కుళించి నీవికను సులుఁవుగా వదలునట్లు చేసినది.—అనుట.

అవ ॥ కవేర్వాక్యం - పరాచీతి ॥ కోపేన ప్రణయకోపేన - పరాచీ పరాఙ్ముఖీ - స్ఫుటకపట నిద్రాముకుళితా- కపటేన కృతా నిద్రా- స్ఫుటావ్యక్తా - తథ్యేవ ప్రతిభాసమానే త్యర్థః - సా చ సా నిద్రా చ తయా -, ముకుళితా నిమీలితాక్షీ సతి - వరతను స్తన్వీ - అఙ్గేన గాత్రేణ అఙ్గం స్వస్య గాత్రం - ప్రవిశ్య ఆసాద్య - పరీరమ్భ

చతురే ఆలిఙ్గన చతురే - ప్రణయిని - నీవీబన్ధంవస్త్రగ్రన్థిం-సభయవ్యాకుల కరం - సభయో భయసహితః - వ్యాకుల స్తరళః - కరో యస్మి న్కర్మణి త త్తథో క్తం - శనై ర్మన్దం - స్పృశతి సతి - అవలగ్నం మధ్యం - సఙ్కోచ్గ్లపితమ్ అ న్తరాకర్షణ కర్శితం-విధ త్తే కరో తీతి సమ్బన్ధః. అత్ర కపటనిద్రయా అవలగ్నసఙ్కోచేన చ నాయికాయా విరహాసహిష్ణుత్వం వ్యజ్యతే. ఔత్సుక్యం నామ సఞ్చారీభావః. అత్ర నాయికా స్వీయా మధ్యా స్వాధీన పతికా చ. నాయకోఽనుకూలః. సమ్భోగశృఙ్గారః. అత్ర కైశికీవృ త్తి రఙ్గం నర్మగర్భః. యు క్తి రలంకారః. ౯౦

---

ఆదృష్టిప్రసరా త్ప్రియస్య పదవీ
ముద్వీక్ష్య నిర్విణ్ణయా
విశ్రా న్తేషు పథి ష్వహః పరిణతౌ,
ధ్వా న్తే సముత్సర్పతి,
గ త్వైకం సశుచా గృహం ప్రతి పదం
పాన్థస్త్రియాఽస్మి న్క్షణే
మాభూ దాగత ఇ త్యమన్దవళిత
గ్రీవం పున ర్వీక్షితమ్. ౯౧

(ప్రయోగవ్యత్యయము.—) ఆ దృష్టి ప్రసరాత్ ప్రియస్య పదవీమ్ ఉద్వీక్ష్య నిర్విణ్ణయా = చూపు నిగుడు వఱకును ప్రియుని దారిని ఎదురు సూచి విసిగినదై, అహః పరిణతౌ ధ్వా న్తే సముత్సర్పతి పథిషు విశ్రా న్తేషు = పగటియొక్క అంతమందు చీఁకటి వ్యాపించుచుండఁగా దారులు మాటుమణిఁగినవి కాఁగా, సశుచా పాన్థ స్త్రియా గృహం ప్రతి ఏకం పదం గత్వా = దుఃఖముతోఁ గూడుకొన్నదైన ప్రోషితుని భార్య ఇంటి

వైపు ఒక యడుగు నడిచి, అస్మిన్ క్షణే ఆగతః మాభూత్ ఇతి = ఈ నిముసమున వచ్చినవాఁడు కాఁడాయెను అని, అమన్ద వళిత గ్రీవం పునః వీక్షితమ్=వడిగా త్రిప్పఁబడిన మెడ గలుగునట్లు వెండియు చూచినది.

నాయిక ప్రోషితుని పతిని పగలు చూపుమేరవఱకు అతఁడు రాగల దారిలో ఎదురునూచుచుండి, ప్రొద్దు గ్రుంకి చీఁకట్లు వ్యాపించి దారులు మాటుమణిఁగిన యనంతరము ఇంటివైపు మఱలినదై ఒక యడుగిడి ఇప్పుడైన వచ్చుచున్నాఁడేమో యని వెనుకకు తిరిగి చూచుచున్నది.— అనుట. ఇందువలన ఆమెయొక్క యనురాగమహత్త్వము తెలియుచున్నది.

అవ ॥ కవే ర్వాక్యం - ఆదృష్టీతి ॥ ఆదృష్టిప్రసరాత్ దృష్టి సఞ్చారావధి - ప్రియస్య వల్లభస్య - పదవీం మార్గ - ముద్వీక్ష్య అవలోక్య - నిర్విణ్ణయా ఖిన్నయా - ప్రియస్యాగమనే నేతి శేషః-అహః పరిణతే దివసావసానే - ధ్వాన్తే తమసి - సముత్సర్పతి ప్రసరతి సతి - పథిషు మార్గేషు - విశ్రాన్తేషు విరతేషు సత్సు - గతాగత శూన్యే ష్విత్యర్థః - సశుచా సఖేదయా - పాన్థస్త్రియా - పాన్థస్య ప్రోషితస్య - స్త్రీ వనితా-తయా-గృహం ప్రతి గృహ ముద్దిశ్య - ఏకం పదం - గత్వా విన్యస్య - అస్మిన్ క్షణే తత్కాల ఏవ-ఆగతో-మా భూ దితి-ప్రియ ఇతి శేషః-అత్ర మా ఇతి నిషేధే నిపాతః న మాఙ్ - మాఙితి చేత్ 'మాఙి లుఙ్'తి ఆశీః ప్రయుజ్యతే-సా త్వత్ర న యుక్తా-కాకురి త్యనుసన్ధేయః - అమన్దవళితగ్రీవం శీఘ్రనివర్తితక న్ధరం యథా తథా - పున ర్వీక్షితం పున ర్విలోకిత మితి సమ్బన్ధః. 'అస్మిన్ క్షణే మాఽభూ దాగత' ఇతి పునర్వీక్షణేన ఔత్సుక్యాతిశయ స్సూచితః. నాయికా స్వీయా, మధ్యా చ. కిం చ ప్రోషితభర్తృకా చ. 'దేశాన్తరగతే కాన్తే ఖిన్నా ప్రోషితభర్తృకా' ఇతి లక్షణాత్. నాయకోఽనుకూలః. ప్రవాసవిప్రలమ్భశృఙ్గారః. అత్ర చేష్టాకృతం శృఙ్గారి సఙ్గేచ్ఛారూపం నమః. జాతిరలంకారః. ౯౧

---

దేశై రన్తరితా, శతై శ్చ సరితా ముర్వీభృతాం, కాననై;
ర్యత్నే నాపి న యాతి లోచనపథం, కాన్తేతి, జానన్నపి
ఉద్గ్రీవ శ్చరణాగ్రరుద్ధవసుధః ప్రోన్మృజ్య సాస్రే దృశౌ
తా మాశాం పథిక స్తథైవ కి మపి ధ్యాయ న్ముహు ర్వీక్షతే.

కాన్తా = ప్రియ, దేశైః సరితాం ఉర్వీభృతాం చ శతైః కాననైః (చ) అన్తరితా = నాళ్ళచేతను నదుల(యు) కొండల(యు) నూర్ల చేతను అడవులచేతను ఎడముగలది, యత్నేన అపి లోచన పథం న యాతి = కడంకచేత నయినను కంటిదారిలోపడదు, ఇతి జానన్ అపి పథికః = ఇట్లని ఎఱుగువాఁడయ్యును ప్రోషితుఁడు, ఉత్ గ్రీవః చరణ అగ్ర రుద్ధ వసుధః సన్ = ఎత్తఁబడిన మెడగలవాఁడును అడుగుల కొనచే త్రొక్కఁబడిన నేలగలవాఁడును అయి, స(అస్రే) అస్రే దృశౌ ప్రోన్మృజ్య తథా ఏవ కిమ్ అపిధ్యాయన్ = కన్నీళ్ళతోడి కన్నులను తుడుచుకొని అట్లె ఏమో తలపోయుచు, తామ్ ఆశాం ముహుః వీక్షతే = ఆ (కాంతయుండు) దిక్కును మాటిమాటికి చూచుచున్నాఁడు.

అనఁగా—ప్రోషితుఁడు తనకు తనభార్యకును నడుమ దేశములు నూర్లకొలఁది ఏళ్లు కొండలును అనేకారణ్యములును అడ్డ మున్నవనియు, ఎప్పాటను కంటికి అగపడదనియు, ఎఱింగియు, నేలమీఁద పాదాగ్రము లూని నిక్కి మెడ యెత్తి కన్నులలోని బాష్పములను తుడిచివైచుకొని ఏమేమో తలపోయుచు ఆ కాంతయుండుదిక్కును కాంచుచున్నాఁడు.

అవ ॥ కవే ర్వాక్యమ్ - దేశై రితి ॥ దేశై ర్విషయై - స్సరితాం నదీనాం - ఉర్వీభృతాం పర్వతానాం - చ - శతై స్సమూహైః కాననై రరణ్యై-శ్చ-అన్తరితా వ్యవహితా-కాన్తా ప్రియా-యత్నే నాపి ఉపాయే నాపి - లోచనపథం దృష్టిమార్గం - న యాతి న ప్రాప్నో-తీతి-జానన్నపి పథికః ప్రోషితః - ఉద్గ్రీవః ఉన్నమితకన్ధరో-భూత్వా - చరణాగ్ర

రుద్ధవసుధః పాదాగ్రావష్టబ్ధభూమి స్సన్ - సాస్రే సబాష్పే - దృశౌ నేత్రే - ప్రోన్మృజ్య పరిమృజ్య - తథైవ తథాభూత ఏవ - కిమపి - ధ్యాయన్ చిన్తయన్ - తామాశాం యత్ర ప్రియా స్థితా తామాశాం దిశం - ముహుః పునః పున - ర్వీక్షతే పశ్యతీతి సంబన్ధః. వ్యక్త ఏ వాభిప్రాయః. ఔత్సుక్యం నామ సఞ్చారీ భావః. జాతి రలంకారః. ౯౨

---

స్విన్నం కేన ముఖం? దివాకరకరైః. స్తే రాగిణీ లోచనే?
రోషాత్తద్వచనోదితాత్. ద్విగుణితా నీలాలకాః వాయునా.
భ్రష్టం కుఙ్కుమ? ముత్తరీయకషణాత్. క్లాన్తాసి? గత్యాగతైః.
ర్యుక్తం తత్సకలం; కి మత్ర వద హే దూతి క్షత స్యాధరే.

నాయికాదుష్టదూతికలయొక్క ఉక్తిప్రత్యుక్తులు.—నాయిక.—(హే) దూతి తే ముఖం కేన స్విన్నమ్ = (ఓసి) కుట్టనీ నీ మొగము ఏల చెమర్చినది? దూతి.—దివాకర కరైః=సూర్య కిరణములచేత. నాయిక.—లోచనే రాగిణీ (కేన) = (నీ) కన్నులు ఎఱుపుగలవి (ఎఱుపెక్కియున్నవి) (ఏల)? దూతి.—తత్ వచన ఉదితాత్ రోషాత్ = అతని మాటవలన జనించిన కోపముచేత. నాయిక.—నీల అలకాః విలుళితాః = నల్లని ముంగురులు రేఁగియున్నవి (ఏల)? దూతి.—వాయునా=గాలిచేత. నాయిక.—కుఙ్కుమం భ్రష్టమ్ = కుంకుమ జాఱినది ఏల? దూతి.—ఉత్తరీయ కషణాత్ = పయ్యెదయొక్క యొరయికవలన. నాయిక.—క్లాన్తా ఆసి బడలినదాన వయితివి (ఏల? దూతి.—గతి ఆగతైః = యాతాయాతములచేత. నాయిక.—తత్ సకలం యుక్తమ్ అధరే క్షతస్య కిమ్ అత్ర వద=అది యెల్లను సరియే (గాని) మోవియందు కొటునకు ఏమి (కారణము) ఈవిషయమునఁ జెప్పుము.

నీవు నీయందలి యితరసంభోగచిహ్నములను ఎట్లు అపలపించినను నీ మోవికాటులు నాకు ద్రోహిణివై నా నాయకునితో నీవు పొందినపొందును బయలువెట్టుచున్నవి సుమా అని దెప్పరము ఉత్తరార్థమున అభిప్రాయము.

అవ॥ నాయకం మా నేతుం ప్రేషితాయాః లక్ష్యమాణసమ్భోగచిహ్నాయాః దూతికాయాః నాయికాయాశ్చ ప్రశ్నోత్తరరూపా వాక్యమాలా-స్విన్నమితి॥ హే దూతి తవ ముఖం కేన కారణేన - స్విన్నం స్వేదయుక్తం-అయం నాయికాయాః ప్రశ్నః-దివాకరకరైః సూర్యకిరణైః-స్విన్నమితి దూత్యా ఉత్తరం-తే తవ-లోచనే-రాగిణీ రక్తే - కేన కారణేన - అయం నాయికాప్రశ్నః - తద్వచనోదితాత్ - తస్య ధూర్తస్య - వచనం వాక్యం - తస్మాదుదితః ఉద్భూతః - తస్మాత్ - క్రోధాత్ కోపాత్ - రక్తే - ఇత్యుత్తరం దత్తం - అలకాః విలులితాః వ్యాకులితాః-అయం ప్రశ్నః-వాయునా విలులితా ఇత్యుత్తరం - కుఙ్కుమం కాశ్మీరం-కేన - భ్రష్టం విగళితమ్-అయం ప్రశ్నః-ఉత్తరీయకషణాత్ సంవ్యానఘట్టనాత్ భ్రష్టమిదముత్తరం - కేన - క్లాన్తాసి తాన్తాసి-అయం ప్రశ్నః-గతాగతైః గమనాగమనైః-క్లాన్తాస్మీత్యుత్తరం - హే దూతి - తత్సకలం త్వయా యదుక్తం తత్సర్వం-యుక్తముపపన్నమ్ - అధరే - క్షతస్య వ్రణస్య - కిం కారణమ్-అత్రాస్మిన్ ప్రశ్నే-వద బ్రూహి - ఉత్తరమితి శేషః. ఇతి సంబన్ధః. అత్ర వదేత్యనేన త్వయా వైదగ్ధ్యాత్సర్వం సమ్భోగచిహ్నమపహ్నుతం అధరక్షతం కథమపహ్నూయత ఇత్యయమర్థోఽవగమ్యతే. నాయికా స్వీయా ప్రగల్భా చ. నాయకశ్శఠః. విప్రలమ్భశృఙ్గారః. ౬౩

---

కఠినహృదయే ముఞ్చ భ్రాన్తిం వ్యలీకకథాశ్రయాం
పిశునవచనైర్దుఃఖం నేతుం న యుక్తమముం జనమ్

కి మిద మథవా సత్యం ముగ్ధే త్వ యాద్య వినిశ్చితం?
య దభిరుచితం త న్మే కృత్వా ప్రియే సుఖమాస్యతామ్.

నాయకుఁడు నాయికను అలుకతీర్చుట.—కఠినహృదయె వ్యళీక కథా ఆశ్రయాం భ్రాన్తిం ముఞ్చ = పరుషమయిన మనస్సుగలదానా కల్లమాటలు ఆధారముగాఁ గల్గిన భ్రమను విడువుము, పిశున వచనైః ఇమం జనం దుఃఖం నేతుం యుక్తమ్ న - కొండెములు చెప్పువారిమాటలచేత ఈజనుని (నన్ననుట) వగపుపొందించుట తగవుగాదు, అథవా ముగ్ధే త్వయా అద్య ఇదం సత్యం నిశ్చితం కిమ్ - అట్లుగాకేని (ఓ) తెలియనిదానా నీచేత ఇపుడు ఇది నిజమని నిశ్చయింపఁబడినదా, ప్రియె యత్ అభిరుచితం తత్ మే కృత్వా సుఖమ్ ఆస్యతామ్ = కాంతా ఏది (నీకు) ఇష్టమో దానిని నాకు చేసి హాయిగా (ప్ర.వ్య.) ఉండుము.

ఖలులకల్లలు నమ్మి నే నపరాధ నని నీవు భ్రమపడియున్నావు. నే నెంత బతిమాలినను నీమనస్సు కరఁగకున్నది. ఇట్లు లేనితప్పులుమోపి నన్ను ఖేదపెట్టుట నీకు న్యాయముగాదు. మఱియు వారి కొండెమే నిజమని నీవు నిశ్చయించుకొంటివేని నీకు తోఁచిన దండన నాకు చేసి సుఖముగా నుండుము.

అవ॥ నాయకో నాయికాం సాన్త్వయ న్నాహ - కఠినహృదయ ఇతి ॥ కఠినహృదయే నిష్ఠురచిత్తే - వ్యళీకకథాశ్రయాం - వ్యళీక కథా మిథ్యా వచనా-న్యాశ్రయోఽధికరణం - యస్యా స్సా తథోక్తా తాం - భ్రాన్తిం మిథ్యామతిం - ముఞ్చ త్యజ-పిశునవచనైః దుర్జన భాషితై - రిమం జనం మా మి త్యర్థః-దుఃఖం నేతుం క్లేశం ప్రాపయితుం - న యుక్తం నార్హం-అథవా హే - ముగ్ధే మూఢే - త్వయా - అద్య ఇదానీమ్-ఇదం ప్రకృతం కర్మ-సత్యం యథా భవతి తథా - వినిశ్చితం కిం నిర్ణీతం కిం - కింశబ్దః ప్రశ్నే - హే ప్రియే-య దభిరుచితం య దిష్టం-త-న్మే మమ-కృత్వా విధాయ - సుఖం యథా భవతి తథా - ఆస్యతాం

స్థీయతా - మితి సంబన్ధః. 'కఠినహృదయే ముగ్ధే' ఇ త్యామన్త్రణబాహు
ళ్యేన క్రమేణ సాన్త్వనానా మానైన్యం సూచ్యతే. అత్ర నాయికా స్వీ
యా, మధ్యా చ. నాయక శ్శఠః. ఈర్ష్యా మానకృతో విప్రలమ్భ
శృఙ్గారః. సోపాలమ్భవచనం నర్మ. ఆక్షేపోఽలంకారః. ౯౪

భ్రూభేదో గుణిత శ్చిరం, నయనయో రభ్యస్త మామీలనం,
రోద్ధుం శిక్షిత మాదరేణ హసితం, మౌనేఽభియోగః కృతః,
ధైర్యం కర్తు మపి స్థిరీకృత మిదం చేతః కథంచి న్మయా,
బద్ధో మానపరిగ్రహే పరికరః, సిద్ధి స్తు దైవే స్థితా. ౯౫

చెలియుపదేశ ప్రకారము మానము దాల్పనిశ్చయించుకొన్న నా
యిక యాచెలితో చెప్పుట. (ప్ర. వ్య.-) మయా భ్రూ భేదః చిరం
గుణితః= నేను బొమలు ముడిచుటను దీర్ఘకాలము ఆవర్తించితిని (=అల
వాటుచేసికొంటిని), నయనయోః నిమీలనమ్ అభ్యస్తమ్ = కనులను మూ
యుట (అనాదరణగా మూయుటను) నేర్చుకొంటిని, ఆదరేణ హసితం
రోద్ధుం శిక్షితమ్=ప్రీతిచే (కలిగెడు) నవ్వును అణచుకొనుటను నేర్చు
కొంటిని, మౌనే అభియోగః కృతః=మాటలాడకయుండుట అభ్యాసము చేసితిని
(వహించితిని), ఇదం చేతః అపి ధైర్యం కర్తుం స్థిరీ కృతమ్=ఈమనస్సును
నియతము దిట్టతనమును వహించుటకు దృఢపఱచితిని, ఏవం మాన పరి
గ్రహే కథఞ్చిత్ పరికరః బద్ధః = ఈతీరున కోపము దాల్చుటకు ఎట్లో
నడికట్టు కట్టితిని (జతనపడియున్నా ననుట), సిద్ధిః తు దైవే స్థితా= నెఱ
వేఱుట యన్ననో అదృష్టములో నున్నది.

నీ యుపదేశముప్రకారము మానము వహింప సర్వసన్నాహ మొన
ర్చుకొని యున్నానుగాని అతనిం గనఁగా మాన మన్నమాట మఱచి తద్వ
శవర్తిని నై మెలంగుదు నని నాకు భయ మగుచున్నది.— అనుట.

అవ॥ మానపరిగ్రహాయ సఖ్యా ప్రోత్సాహితా నాయికా తాం ప్రత్యాహ-భ్రూభఙ్గేతి॥ భ్రూభఙ్గః భ్రూభఙ్గ-శ్చిరం-గుణిత ఆమ్నాతః - నయనయో ర్నేత్రయోః ఆమీలన మీషన్ముకుళనం అనాదరదృష్టి రిత్య ర్థః. అభ్యస్త మావర్తితం - ఆదరేణ ప్రీత్యా - జాయమానం-హసితం స్మిత-రోధ్గం నివారయితుం - శిక్షితం కల్పితం - మానే అభాషణే - అభి యోగః ఆస్థా-కృతః ప్రవర్తితః - ఇదం చేతోఽపి స్థైర్యం కతుం స్థైర్యకరణాయ - స్థిరీకృతం స్థిరత్వం నీతమ్-ఏవం మయా-మానపరిగ్రహో పగ్రహణే - పరికరః సామగ్రీ - కథంచి త్క్రుచ్ఛ్రేణ-బద్ధ స్సన్నద్ధః - సిద్ధి స్తు నిగ్రహణం తు - దైవే భాగధేయే - స్థితేతి సంబద్ధః. అత్ర నా యికా స్వీయా ముగ్ధా చ. నాయక శ్శఠః. ఆక్షేపరూపం శృఙ్గారి నమక . ఆక్షేపోఽలంకారః. ౯౫



చరణపతనం, సాస్రాలాపా, మనోహరచాటవః,
కృశతరతనో ర్గాఢాశ్లేషో, హఠా త్పరిచుమ్బనమ్,
ఇతి బహుఫలో మానారమ్భ స్తథాఽపి చ నోత్సహే,
హృదయదయితః కాన్తః కామం; కిమత్ర కరో మ్యహమ్!

మానము దాల్పుమని హెచ్చరించిన చెలితో అశక్య మని నాయిక చెప్పుట.—చరణపతనమ్= కాంతుఁడు నా పాదములలో వ్రాలుట, స అస్ర ఆలాపాః=కన్నీళ్లతోడి మాటలు (కాంతుఁడు నామోల కన్నీళ్లతో మొఱపెట్టుకొనుట). మనోహరచాటవః = మనస్సును హరించునట్టి పలు కులు, కృశ తర తనోః గాఢ ఆశ్లేషః - చిక్కిలి యుడిగిన శరీరముగల యాతనియొక్క బిగి కౌఁగిలింత, హఠాత్ పరిచుమ్బనమ్=బలాత్కారమున ముద్దువెట్టుకొనుట, ఇతి మాన ఆరమ్భః బహు ఫలః=ఈతీరున అలుక పూ నుట పెక్కు ప్రయోజనములుకలది, తథా అపి చ న ఉత్సహే = అట్లు

అయినను (అలుక దాల్చుటకు నేను) కడంగను, యతః కాన్తః కామం హృదయ దయితః = ఏలయనఁగా కాంతుఁడు మిక్కిలి డెందమునకు ప్రియుఁడు, అత్ర అహం కిం కరోమి = ఈవిషయమందు (నీయుపదేశము నెఱవేర్చుటకై) నేను ఏమి చేయుదును (నెఱవేర్పఁజాల ననుట.)

అవ॥ మానం కురుష్వ తత్ర గుణోఽస్తీతి సఖ్యా బోధితా నాయికా తాం ప్రత్యాహ-చరణపతన ఇతి॥ చరణపతనం పాదప్రణామః - సాస్రాలాపాః సబాష్పభాషితాని దీనవచనానీత్యర్థః. - మనోహరచాటవః అత్యన్తప్రియోక్తయః - కృశతరతనోః క్షీణగాత్రస్య - ప్రియస్య - గాఢాశ్లేషః దృఢపరిరమ్భః - సూ॥ 'కర్తృకర్మణోః కృతి' ఇతి కర్తరి షష్ఠీ - ప్రియేణ భర్త్రా - కృతః ఆశ్లేషః-హఠాత్ బలాత్కారాత్॥ ని॥ 'ప్రసభస్తు బలాత్కారో హఠ' ఇత్యమరః. పరిచుమ్బనం చేత్యనేన ప్రకారేణ - మానారమ్భః కోపోద్యోగః - బహుఫలః అనేకప్రయోజనః-తథాఽపి చ-నోత్సాహో నోద్యోగోఽస్తి-యతః కాన్తః-కామ మత్యర్థం - హృదయ దయితో మనోవల్లభః-అతో నోత్సాహోఽయః - అత్ర అస్మిన్ప్రసఙ్గే-అహం-కిం కరోమి కిమాచరామీతి సంబన్ధః. 'బహుఫలో మానారమ్భ' ఇత్యత్ర సఖీవచనానువాదాత్ మానారమ్భస్య బహుఫలత్వ మఙ్గీకృతం న స్వత ఇత్యనుసన్ధేయం, 'తథాఽపి చ నోత్సాహ' ఇత్యనేన ఆత్మనోఽశక్తి స్సూచితా, 'అత్ర కిం కరోమీ' త్యనేన ఇతః పరం భవత్యా యదుపదిశ్యతే తత్కరోమీత్యయమర్థోఽవగమ్యతే. నాయికా స్వీయా మధ్యా చ. నాయక శ్శఠః. విప్రలమ్భశృఙ్గారః. ఆక్షేపశ్లేషరూపం శృఙ్గారి నమణ. హేతు రలంకారః. ౯౬

---

కాన్తే తల్ప ముపాగతే విగళితా
నీవీ స్వయం తత్ క్షణాత్,

త్తద్వాస శ్శ్లథమేఖలాగుణధృతం
కించి న్నితమ్బే స్థితం,
ఏతావ త్సఖి వేద్మి కేవల మహం
త స్యాఙ్గసఙ్గే పునః,
కోఽసౌ, కాఽస్మి, రతం చ కిం, కథ మితి,
స్వల్పాఽపి మే న స్మృతిః, ౯౭

నాయిక ప్రియునిపొందునందలి తన (యానంద) జడత్వమును చెలితో చెప్పుకొనుట.—కాన్తె తల్పమ్ ఉపాగతె నీవీ స్వయం విగళితా = ప్రియతముఁడు పాన్పుకడకు రాఁగానే పోఁకముడి తనంతటతానే వీడిపోయినది, తత్ వాసః శ్లథ మెఖలా గుణధృతం (సత్) నితమ్బె కించిత్ స్థితమ్=ఆ వలువ జాఱిన మొలనూలితంతువుచేత ఆఁపఁబడినదై ఇంచుక పిఱుందుపై నిలిచినది, (హె) సఖి అహమ్ ఏతావత్ కేవలం వేద్మి = (ఓ) చెలీ నేను ఇంతమాత్రమే ఎఱుఁగుదును, తస్య అఙ్గ సఙ్గే పునః=అతని యొడలి తాఁకుడునందలి (తాఁకుడు కలిగినంతట), అసౌ కః అహం కా అస్మి రతం చ కిమ్ ఇతి=ఇతఁడు ఎవరో నేను ఎవతె (ను అయితి) నో మదనక్రీడయును ఏమో అని, స్వల్ప అపి మె స్మృతిః న = ఇంచుక యేనియు నాకు జ్ఞప్తి లేదు, కథమ్ = (ఇది) యెట్లు?

చెలీ, కాంతుఁడు పాన్పుకడకు రాఁగానే నాపోఁకముడి వీడిపోవుటయు నావలువ జాఱిపోయి మొలనూలి తీఁగకు తగులుకొని ఇంచుక నిలుచుటయు నా కెఱుక, అనంతరవృత్తాంతము నా కేమియుం దెలియదాయెను, ఇందుల కేమి కారణమో చెప్పుము.—అనుట.

అవ ॥ నాయికా సఖీ మాహ-కాన్త ఇతి ॥ కాన్తే ప్రియే - తల్పం శయ్యామ్ - ఉపాగతే ప్రాప్తే - సతి - నీవీ వస్త్రగ్రన్థిః - తత్క్షణా త్తత్కాలమాత్రాత్ - స్వయ మాత్మనా - విగళితా స్రస్తా - తద్వాస

శ్లథలితనీవికం వస్త్రం - శ్లథమేఖలా గుణధృతం శిథిలకాఞ్చీసూత్రధారితం సత్ - నితమ్బే కటిప్రదేశే - కించి దిషత్ - స్థితం - హే సఖి అహం - కేవలం ఏతావ దేవ పూర్వోక్తం యత్తద్వద్ధి జానామి - తస్య ప్రియస్య - అఙ్గసఙ్గే పునః గాత్రస్పర్శే తు - అసౌ కః అహం కో౽స్మి రతం చ కింరూప మితి మే స్వల్పాపి స్మృతి ర్న - కథం కుతో హేతో రితి సంబన్ధః. జడతా నామ సఞ్చారీ భావః. యథోక్తం - 'జాడ్య మప్రతిపత్తి స్స్యా దిష్టానిష్టేక్షణాదిభిః' ఇతి. నాయికా స్వీయా మధ్యా చ, కించ స్వాధీనపతికా. నాయకో౽నుకూలః. సమ్భోగశృఙ్గారః. ఆక్షేపరూపం వస్తు, జాత్యలంకారః. ౯౭

నిశ్వాసా వదనం దహన్తి, హృదయం
నిర్మూల మున్మూల్యతే,
నిద్రా నైతి, న దృశ్యతే ప్రియముఖం,
నక్తందివం రుద్యతే,
అఙ్గం శోష ముపైతి, పాదపతితః
ప్రేయాం స్తథోపేక్షితః,
సఖ్యః కం గుణ మాకలయ్య దయితే
మానం వయం కారితాః. ౯౮

చెలులమాట విని కృతాగతప్రణతుని నాయకుని తిరస్కరించి అనంతరము పశ్చాత్తప్తయై నాయిక ఆచెలులను నిందించుచు.—(ప్రయోగవ్యత్యయములు.—) (హే) సఖ్యః కం గుణమ్ ఆకలయ్య వయం దయితే మానం కారితాః . (ఓ) చెలులారా ఏ ప్రయోజనము కనిపట్టి ప్రియుని మీఁద మమ్ము అలుక చాల్పించితిరి, (మీమాట విన్నందున), నిశ్వాసాః వదనం దహన్తి = నిట్టూర్పులు (నా) నోటిని కాల్చుచున్నవి, హృదయం

నిర్మూలమ్ ఉన్మూల్యతే. డెందము వేరూడ పెకలింపఁబడుచున్నది, నిద్రా న ఏతి = నిదుర రాకున్నది, ప్రియ ముఖం న దృశ్యతే = దయితుని మొగము కానఁబడకున్నది, నక్తం దివం రుద్యతే = రేయుం బవలు ఏడ్చుచున్నాను, అఙ్గం శోషమ్ ఉపైతి = (నా) దేహము ఎండిపోవుచున్నది, పాద పతితః ప్రేయాన్ తథా ఉపేక్షితః = అడుగులందు వ్రాలిన ప్రియతముని అట్లు ఒప్పరికించితిని.

అవ ॥ సఖీనాం ప్రేరణయా గృహీతమానా గృహాఽగత మనునయన్తం ప్రియం నిరస్య పశ్చాత్తాపం గతవతీ నాయికా తా ఉపాలభతే-నిశ్వాసా ఇతి॥ హే సఖ్యః యస్మాత్పాదపతితః ప్రేయాన్ - తథా తేన ప్రకారేణ-ఉపేక్షితః అనాదృతః - తస్మాన్నిశ్వాసా - వదనం ముఖం - దహన్తి శోషయన్తి-హృదయం హృత్పుటం - నిమూలం నిరవశేషం - ఉన్మూల్యతే ఉత్పాట్యతే సన్తాపే నేతి శేషః - నిద్రా - నైతి న ప్రాప్నోతి - ప్రియముఖం న దృశ్యతే - నక్తం దివం రాత్రిం దివం-రుద్యతే అశ్రుమోచనం క్రియతే - అఙ్గం శోష ముపైతి-కం - గుణం ప్రయోజనం-ఆకలయ్యావిచార్య-దయితే ప్రియే-వయం - మాన నిర్మాణకృతకోపం - కారితాః గ్రాహితాః - భవతీభి రితి శేషః - ఇతి సంబన్ధః. సంజ్వరో నామ దశావిశేషః. నాయికా స్వీయా ముగ్ధా చ, కలహాన్తరితా. నాయక శ్శఠ. విప్రలమ్భ శ్శృఙ్గారః. తత్ర విప్రలమ్భ కృతం సోపాలమ్భవచనం నర్మ. ఆక్షేపాఽలంకారః. ౯౮



నా న్తర్గ్ర ప్రవేశ మరుణ, ద్వాముఖీ నం చాసీ,
దాచష రోషపరుషాణి, న చాక్షరాణి,
సా కేవలం సరళపక్ష్మభి రశ్రుపాతైః
కాన్తం విలోకితవతీ జననిర్వ్యశేషమ్. ౯౯

అత్యంతాపరాధిని ప్రియుని గూర్చి నాయికాకోపప్రకారవిశేషము.- సా అన్తః ప్రవేశం న అరుణత్ = ఆమె (ఇంటి) లోనికి (కాంతుని) చొచ్చుటను అడ్డగింప దాయెను, విముఖీ చ న ఆసీత్ = (చొచ్చినయా తనినుండి) పెడ మొగము పెట్టుకొన్నట్టిదియు కా దాయెను, రోష పరుషాణి అక్షరాణి న అచష్ట = కోపముచే కఠినములయిన మాటలను పలుక దాయెను, (మఱి యేమి చేసిన దనఁగా.—)సరళైః పక్ష్మభిః అక్షి పాన్తైః కాన్తం జన నిర్విశేషం కేవలం విలోకితవతీ = తిన్నని ఱెప్పలుగలవైన కను పాటులచేత (చూపులచేత ననుట) ప్రియుని సామాన్య జనునివలె ఊరక చూచినది. ఉపేక్షచేతనే దండించినదనుట.

అవ॥ అత్యన్తాపరాధిని ప్రియే సమాగతే సతి కుపితాయా నాయికాయాః ఆకారగోపన ప్రకారం కవి రాహ - నాన్త ఇతి॥ సా నాయికా నాయకస్య - అన్తః ప్రవేశం గృహాన్తఃప్రవేశం - నారుణత్ న నివారయతి స్మ - కించ - విముఖీ పరాఙ్ముఖీ చ - నాసీత్ నాభవత్ - కించ- రోషపరుషాణి కోపకర్కశాని - అక్షరాణి వచనాని చ - నాచష్ట నాభాషత - కిం తు - సరళపక్ష్మభిః - సరళాని ఋజూని - పక్ష్మాణి - నయన ప్రాన్తలోమాని - యేషు తె తథోక్తాః తైః - అక్షిపాన్తై నయనప్రపాన్తైః - కాన్తం ప్రియం - జననిర్విశేషం సర్వజనసామాన్యం యథా భవతి తథా - కేవలం - విలోకితవతీ దృష్టవత్యే వేతి సంబన్ధః. 'జననిర్విశేషం విలోకితవతీ' త్యనేన అపరాధినః ప్రియస్య అనాదరణరూపం దణ్డనం కృత మిత్యవగమ్యతే. అవహిత్థం నామ సంచారీభావః. నాయికా స్వీయా ధీరా ప్రగల్భా చ. నాయక శ్శఠః. ఈర్ష్యామానకృతో విప్రలమ్భశ్శృఙ్గారః. ఈర్ష్యాక్రోధప్రాయం నమః. ఆక్షేపోఽలంకారః.

---

ప్రియకృత పటస్తేయక్రీడా విలమ్బన విహ్వలాం
కి మపి కరుణాలాపాం తన్వీ ముదీక్ష్య ససంభ్రమమ్

అపి విగళితే స్కన్ధావారే గతే సురతాహవే
త్రిభువన మహాధన్వీ స్థానే న్యవర్తత మన్మథః. ౧౦౦

ప్రియ కృత పట స్తేయ క్రీడా విలమ్బన విహ్వలాం = ప్రియునిచేఁ జేయబడినవస్త్ర చౌర్య కేలియొక్క కాలయాపనచేత వ్యాకులయు, కిమ్ అపి కరుణ ఆలాపాం తన్వీం=ఏమో దీనమయిన మాటలుగలది (యు నైన) సుందరిని, ఉదీక్ష్య=చూచి, త్రి భువన మహా ధన్వీ మన్మథః = ము ల్లోక ముల గొప్ప విలుకాఁడు మదనుఁడు, అపి సురత ఆహవే గతే (సతి) = మఱి సంభోగయుద్ధము నివర్తిల్లఁగా, స్కన్ధావారే విగళితే = సేనల మొగ్గరము చెదరిపోఁ-గా, ససంభ్రమం న్యవర్తత స్థానే = త్వరగా వెను కకుమఱలెను యుక్తమే.

ఆ దీనాలాపములతో మదనజయము సంపూర్ణ మాయె నని భా. ఇట పటస్తేయక్రీడ సంభోగాంతమందు, సమస్తమయినయుద్దీపనసామగ్రియే స్కంధావారము.

అవ ॥ కవే ర్వాక్యమ్॥ ప్రియకృత ఇతి॥ ప్రియకృత పటస్తేయక్రీడా విలమ్బన విహ్వలాం - ప్రియేణకృతా పటస్తేయ క్రీడా- పటస్య వస్త్రస్య- స్తేయం చౌర్యం-తదేవ - క్రీడా వినోదః - తస్యా-విలమ్బనం కాలక్షేపః- తేన-విహ్వలాం వ్యాకులితాం - కి మపి- కరుణాలాపా మత్యన్త దీనభాషి తాం - తన్వీం కాన్తాం - ఉదీక్ష్య అవలోక్య అవగ మ్యే త్యర్థః - త్రిభువనమహాధన్వీ త్రైలోక్యవీరః - మన్మథ - స్సురతాహవె సమ్భోగ సమరే - గతే నివృత్తే సతి - స్కన్ధావారే - విగళితే చ్యుతే స త్యపి - ససంభ్రమం సత్వరం యథా భవతి తథా - న్యవర్తత నివృత్తోఽభూత్- స్థానే యుక్త - మితి సంబన్ధః. అత్ర పటస్తేయక్రీడా సమ్భోగావసానే- కృతేతి వేదితవ్యా - 'గతే సురతాహవ' ఇత్యుక్తత్వాత్, సురతస్య

ఆహార్యత్వ నిరూపణ మత్ర పరస్పరోపమర్దనస్య విద్యమానత్వాత్, అత్ర స్కన్ధావారశబ్దేన స్రక్చన్దనాది ప్రసాధన హార మేఖలా ద్యాభరణ లీలా విలాస విభ్ర మాది చేష్టా స్వరూపా ఉద్దీపన సామగ్రీ కథ్యతే, 'విగళిత' ఇత్యనేన సురతాన్తే లక్ష్యమాణ సామగ్రీశైథిల్యం కథ్యతే, అత్ర 'న్యవర్తత మన్మథ' ఇత్యనేన పున స్సురతారమ్భోఽవగమ్యతే. యథా లోకే పురుషః పరాన్నిర్జిత్య గళితసన్నాహః ప్రయాణే స్వైః పశ్చాత్పరై రభిభూతానాం స్వకీయానాం ఆర్తనాదం శ్రుత్వా తత్పరిశమనాయ పున ర్నివర్తతే తథాఽయ మిత్యభిప్రాయః. అత్ర వ్రీడా నామ సఞ్చారీభావః. నాయికా స్వీయా మధ్యా స్వాధీనపతికా చ. నాయకోఽనుకూలః. సమ్భోగశృఙ్గారః. చేష్టాకృతం హాస్యం శృఙ్గారి నర్మ. హేతు రలంకారః. ౧౦౦

---

సాలక్తకేన నవపల్లవకోమలేన
పాదేన నూపురవతా మదలాలసేన
య స్తాడ్యతే దయితయా ప్రణయాపరాధా
త్సోఽఙ్గీకృతో భగవతా మకరధ్వజేన. ౧౦౧

యః = ఎవఁడు, ప్రణయ అపరాధాత్ దయితయా స(హ) అలక్తకేన నవపల్లవ కోమలేన నూపుర వతా మద లాలసేన పాదేన తాడ్యతే = నెయ్యంపు నేరమి వలన (నెయ్యమునకు విరోధముగా నడుచుకొన్నవాఁ డగుటం జేసి) ప్రియచేత లత్తుకతో, గూడుకొన్నదియు క్రొత్త చిగురువలె మృదువును అందియ గలదియు మదముచే చంచలమును అయినయడుగుచేత తన్నఁబడునో, సః మకరధ్వజేన భగవతా అఙ్గీకృతః = అతఁడు మదనదేవునిచే మెచ్చుకొనఁబడినవాఁడు. తన్నఁబడినవాఁడే మెచ్చుకొనఁబడియె నేని, మన్ననలు వడసినవానిమాట చెప్పవలయునా? అనుట.

అవ॥ కవేర్వాక్యమ్॥ స్పష్టోర్థః. అత్ర ‘దయితయా పాదేన తాడితో ఽపి భగవతా మకరధ్వజేన అఙ్గీకృత’ ఇత్యనేన నానావిధై రుపచారై రుపలాలితః కిము తేత్యర్థ స్సూచితః. ఏతావతా కామపురుషార్థస్య ఉపాదేయత్వ ముక్తం భవతి.

ఇతి శ్రీవీరనారాయణ సకలవిద్యావిశారద పెద్దకోమటి
వేమభూపాల విచిరతా శృఙ్గారదీపికాఖ్యా అమరుక
వ్యాఖ్యా సమాప్తా.

చంద్రికాప్రెస్, చాకలపేట, మదరాసు.—5-1-1950

# అనుబంధము

అమరుకవిప్రణీతము లని కొందఱచే భావింపఁబడిన యధిక శ్లోకములలో రసవత్తరము లయినవి కొన్ని యివి.—

సా బాలా, వయ మప్రగల్భమనసః;
సా స్త్రీ, వయం కాతరాః;
సా పీనోన్నతిమత్ పయోధరయుగం
ధత్తె, సఖేదా వయమ్;
సాఽక్రాన్తా జఘనస్థలేన గురుణా,
మన్దం ప్రయాతా వయం;
దోషై రన్యజనాశ్రయై రపటవో
జాతాః స్మ ఇ త్యద్భుతమ్!

అయోగవిప్రలంభంబున నాయకుఁడు తలపోయుట.—ఎవరియందు బాల్యము, స్త్రీత్వము, ఱొమ్మున బరువు మోచుట, వెనుక బరువు ఈడ్చుటయు, నను కారణములు కలవో వారియందే (వరుసగా) బేలతనము, పిరికితనము, అలసత, నడవలేమియు, నను కార్యములు ఉండును. ఇట్టి విషయములో, ఈకారణము లన్నియు నాయికయందును ఈకార్యము లన్నియు నాయందును ఉన్నవి; ఇది యాశ్చర్యము గదా.—బాలమీఁదివిరాళిచేత నిట్లు ఈ యపాటవమునకు పాలైతి ననుట.

హారోఽయం హరిణాక్షీణాం లుఠతి స్తనమణ్డలే;
ముక్తానా మ ప్యవ స్థేయం, కే వయం స్మరకింకరాః!

ముక్తానామ్ - ముత్తెములయొక్క అని యర్థము, ముక్తులయొక్క అని శ్లేష.

న జానే సమ్ముఖాయాతే ప్రియాణి వదతి ప్రియే
సర్వాణ్యఙ్గాని కిం యాన్తి శ్రోత్రతాముత నేత్రతామ్.

ప్రియునిఁ జూచుటకును అతని మాటలు వినుటకును కోరిక మిక్కుటమాయె నని భా.

పీతో యతః ప్రభృతి కామపిపాసితేన
తస్యా మయాఽధరరసః ప్రచురః ప్రియాయాః,
తృష్ణా తతః ప్రభృతి మే ద్విగుణత్వ మేతి;
లావణ్య మస్తి బహు తత్ర కిమత్ర చిత్రమ్?

లావణ్య మనఁగా కాంతి, ఉప్పఁదనము (లవణస్య భావః లావణ్యమ్) అని శ్లేష. ఉప్పునీళ్లు త్రాగిన దప్పి హెచ్చును గదా.

---

# వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4. మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి, జి. టి. మదరాసు.

ఆర్డరుతోకూడ సగముసొమ్ము అడ్వాన్సు పంపవలెను.

(తపాలుచార్జి ప్రత్యేకము.)

## సంస్కృత గ్రంథములు.

| | రు. | |
|---|---|---|
| మేఘసందేశము, మల్లినాథ వ్యాఖ్య - తెనుఁగున ప్రతిపద టీకాతాత్పర్యపద ప్రయోజనచర్చ-ఆక్షేపసమాధానములు. | 2 | 8 |
| రఘువంశము మల్లినాథవ్యాఖ్య- తెనుఁగు టీకాతాత్పర్యములు. మొదటి 6 సర్గలు | 3 | 0 |
| కుమారసంభవము, మొదటి 6 సర్గలు. పైదానివలెనే టీక. | 3 | 0 |
| అమరుకావ్యము శృంగారలక్ష్యము. వేమభూపాల సంస్కృత వ్యాఖ్య. సంపూర్ణాంధ్రటీకయు. అచ్చగుచున్నది. | 1 | 8 |
| పుష్పబాణవిలాసము. సంస్కృతవ్యాఖ్య. తెనుఁగు పూర్ణటీక. | 0 | 12 |
| హితోపదేశము, మూలముమాత్రము | 1 | 0 |
| పంచతంత్రము, ,, | 1 | 8 |
| దశకుమారచరిత్రము ,, | 1 | 0 |
| వ్రతకల్పవల్లి (6 వ్రతములు) | 0 | 12 |
| బిల్హణచరిత్రము, తెనుఁగు పూర్ణటీక. (అచ్చగుచున్నది) | | |
| రసమంజరి, శృంగార రస స్వరూపవిస్తరము, సటీక. ,, | 1 | 8 |
| ప్రియదర్శికానాటిక, శ్రీహర్షకృతి సంస్కృతటిప్పణము గద్య పద్యములుగా ఆంధ్రీకరణము సయితము | 1 | 0 |
| శబ్దమంజరీ సమాసకుసుమావళీ తిఙంతమంజరులు, పాత్రప్రతి | 0 | 4 |

## ఆంధ్ర గ్రంథములు.

### పద్యకావ్యములు.

| | | |
|---|---|---|
| ఆముక్తమాల్యద సంజీవనీవ్యాఖ్య. | 12 | 0 |
| శృంగారనైషధము సర్వంకషావ్యాఖ్య (అచ్చగుచున్నది) | | |

| | | |
|---|---|---|
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి. టీకాసహితము. క్రొత్తయచ్చు | 3 | 0 |
| సారంగధరచరిత్రము ,, ,, | (అచ్చులో) | |
| జ్ఞానవాసిష్ఠరామాయణము, వేదాంతము, మడికిసింగనకృతి | 1 | 8 |
| ఆంధ్రబిల్హణీయము, నిర్దోషము | 0 | 8 |
| పారిజాతాపహరణము, మూలము | 0 | 8 |
| సారంగధరచరిత్ర. ద్విపద (కవి విశ్వకర్మమతస్థుఁడు) | 0 | 8 |
| హరిశ్చంద్ర, ద్విపద, గౌరనమంత్రి ప్రణీతము | 1 | 0 |

## నా ట క ము లు.

| | | |
|---|---|---|
| ప్రతాపరుద్రీయనాటకము, సటిప్పణము, క్రౌనుసైజు | 2 | 0 |
| బొబ్బిలియుద్ధనాటకము | 1 | 8 |
| ఉషానాటకము, సటిప్పణము, క్రౌనుసైజు | 1 | 8 |
| శాకుంతలనాటకము, కాళిదాసీయమునకు తెనుఁగు | 1 | 0 |
| విక్రమోర్వశీయనాటకము, Inter Text నోట్సుతో | 2 | 0 |
| మాళవికాగ్నిమిత్రనాటకము | 0 | 12 |
| నాగానంద నాటకము | (అచ్చగుచున్నది) | |
| రత్నావళీనాటిక, శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారివ్యాఖ్యతో | 1 | 4 |
| ప్రియదర్శికానాటిక | 0 | 8 |
| ఉత్తరరామచరిత్రనాటకము—విపులమగుపీఠికతో పునర్ముద్రితము | 2 | 0 |

## సులభ వచనగ్రంథములు.

| | | |
|---|---|---|
| హితోపదేశకథలు, నీతిబోధకములు, (అచ్చగుచున్నది) | 0 | 8 |
| భోజ కాళిదాసకథలు, రసభరితములు. | 0 | 12 |
| బేతాళపంచవింశతిక ,, | 0 | 12 |
| విక్రమార్కుని యద్భుతకథలు, గుణముకలిగించునవి. పునర్ముద్రితము | 0 | 12 |
| కథాసరిత్సాగరము, అద్భుతనీతి వ్యవహారకథలు, ఆఱుభాగములు | 12 | 0 |
| ఒక్కొకభాగము ప్రత్యేకముగా | 2 | 8 |
| ఆంధ్రదశకుమారచరిత్రము, మూలమునకు సరియైనయాంధ్రీకరణము | 1 | 0 |

## లక్షణగ్రంథములు.

ఆంధ్రసాహిత్యదర్పణము. ఉదాహరణశ్లోకములతో 5 0
కావ్యాలంకారచూడామణి తొమ్మిది ఉల్లాసములు 1 8
అలంకారసారసంగ్రహము, సటీకాతాత్పర్యము 0 12
ఛందస్సు, విద్యార్థుల కుపయోగము, సంగ్రహము 0 4

## శారదాకాంచికలు – విమర్శలు – ఉపన్యాసములు.

జక్కన విక్రమార్కచరిత్ర ముద్రణవిమర్శనము 1 కింకిణి (అచ్చగుచున్నది)
ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శ 2 కింకిణి ,,
కాళహస్తిమాహాత్మ్య ముద్రణవిమర్శనము 3 కింకిణి ,,
గ్రామ్యభాషాప్రయోగనిబంధనము. (ప్రాక్ప్రోచిత భాషనుగుఱించినది) 4 కింకిణి 0 12
మోచాకుసుమామోదవిచారము 5 కింకిణి ,,
ఆంధ్రవ్యాకరణసర్వస్వ విమర్శనము 6 కింకిణి ,,
విమర్శవినోదము, సంస్కృతాంధ్రకావ్యనాటకాది విషయకము 0 12
తిక్కన సోమయాజివిజయము 0 8. విసంధివివేకము 0 2
భారతాభారతరూపకమర్యాదలు, (నాట్యకళాచరిత్రము) 0 6
ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము 0 6
గ్రామ్యాదేశనిరసనము, కడుపుబ్బనవ్వించు విమర్శ 0 6
స్త్రీపునర్వివాహగ్రంథము 1 0
ఆంధ్ర హితోపదేశచంపువు, గద్యపద్యాత్మకము 1 4
ఆంధ్ర భాషాసర్వస్వార్థనియమకతిపయములు (నిఘంటురచనావిధి) 0 4

## క్రొత్తగా వెలువడిన గ్రంథములు.

కుమారదేవపండితీయము, ప్రౌఢవ్యాకరణవ్యాఖ్య. తాళ్లూరివారిది 2 8
పద్యకథాలహరి For Comprehension Test అప్రూవుడు 0 12
ఉదయనచరితము. శ్రీ శాస్త్రిగారి కథాసరిత్సాగరమునుండి పాఠశాలలకొఱకు సంగ్రహింపఁబడినది. వచనము అప్రూవుడు 0 12

తెలుఁగు ఫైలాలజీ TELUGU PHILOLOGY ఆంధ్రశబ్ద
తత్త్వము. కీ. శే. శ్రీ ప్రొఫెసరు, శేషగిరిశాస్త్రిగారిచే రచి
యింపఁబడినది. ఇప్పుడే పునర్ముద్రితము. ఇందు ఆంధ్రవ్యాక
రణము సంపూర్ణముగా చర్చింపఁబడియున్నది. అరవ, కన్నడ,
మలయాళ భాషలతోడి పోలికలు చూపఁబడియున్నవి. ఫైలా
లజీవిద్యార్థులకు చాల ఉపయోగకరము 2 భాగములు 3 0

అర్ధానుస్వారతత్త్వము. వీరిదే. 0 8

చరిత్రరచన. ప్రథమభాగము. చరిత్రరచన యనగా నేమి? సాధన
సామగ్రి ఎట్టిది? అనువిషయములను చర్చించి శాతవాహన,
పల్లవ, చాళుక్య, చోళుల ప్రారంభచరిత్రములను ఈభాగ
మున సులువైనశైలిలో ఎల్ల వారికిని ఉపయోగపడునట్లు శ్రీ
నేలటూరు వేంకటరమణయ్యగారు రచియించియున్నారు. 2 0

అక్కన్న మాదన్నలచరిత్రము. కర్త: వే. వేం. శాస్త్రి (M. A.)
గోలకొండ కుతుబుషాహి సుల్తానులలో కడపటివాఁడైన
తానీషాయొక్కయు, రామదాసు (గోపన్న)యొక్క మామ
లైన ఈ యాంధ్రమంత్రులయొక్క విషాదచరిత్రము సులు
వైన నవలవలె రచియింపఁబడియున్నది. 2 0

శ్రీకృష్ణరాయవిజయనాటకము. కర్త: వే. వేం. శాస్త్రి (M. A.) 0 8

వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము—25 ప్రక
రణములు. సులువైనశైలి. శాస్త్రులవారి హాస్యము, విమర్శలు, విద్యా
వినోదములు, సుఖదుఃఖములు, సమకాలికపండితవిమర్శలు మొదలైన
యనేకవిశేషములు గలవు. శ్రీ డాక్టరు, సర్, కట్టమంచి రామలింగా
రెడ్డిగారి 'గురుపూజ' యను నుపన్యాసముతో నలంకృతము. 2 0

A HAND-BOOK OF CLASSICAL SAMSKRIT
LITERATURE for college students. (Sri U
Venkatakrishna Rao, M. A.) With Questions. 2 0